స్టాండర్డ్ హైలో కూలర్(5 లీటర్లు) | డీలక్స్ హైలో కూలర్(7 లీటర్లు) | సూపర్ హైలో కూలర్(5 లీటర్లు) | క్యాంపర్ కూలర్(8 లీటర్లు)



# వేసవికాలంలో చల్లటి పానీయాల కోసం ఈగిల్ కూలర్ శ్రేణి




ఈగిల్ థర్మోవేర్ కూలర్ల విస్తృత శ్రేణి. వేసవికాలంలో దాహం-తీర్చే చల్లటి పానీయాలు పొందడానికి ఇదొక మంచి మార్గం. ఈగిల్ థర్మోవేర్ కూలర్ వుంటే ఒక పోర్టబుల్ ఫ్రిడ్జ్ వున్నట్లే మరి!






# రైతుల పాలిటి కల్పతరువు

# రామగుండం యూరియా




ఆంధ్రప్రదేశ్ లో తయారు చేయబడుతున్న యూరియా, రామగుండం యూరియా.

అన్ని పంటలకు, అన్ని కాలములకు అనువైన ఎరువు.

వాడండి
రామగుండం యూరియా.

**స్వస్తిక్ బ్రాండ్**
**యూరియా**




**ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్**
**ఆఫ్ ఇండియా లిమిటెడ్**

అమ్మకపు విభాగము
6-2-30/C, లకిడి కా పూల్.
హైదరాబాదు-500 004.

Sobhagya

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 10–6–'83

రుధిరోద్గారి నామ సం. వైశాఖ బ. చతుర్దశి

సంపుటము 75 సంచిక 41

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు. | 1-50 |
| ఆరు మాసాల చందా | రు. | 42 90 |
| పోస్టులో ఏడాది చందా | రు. | 85 80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

ఆంధ్రప్రదేశ్, తమిళనాడు ముఖ్య మంత్రులు

ఎన్. టి. ఆర్., ఎం. జి. ఆర్.



లోకంపోకడ * ఊరిమెన్



# అభివృద్ధి పేరుతో పేదలకి అన్యాయం!

సౌదీ అరేబియా భారతదేశం నుంచి గొర్రె మాంసం దిగుమతిని ఆపివేసిందట! అది ఒక శుభవార్త. రెండుసార్లు పంపిన సరుకు బాగాలేదన్న కారణంగా నాణ్యమైనదైతే తప్ప తీసుకోమని వాళ్లు నిష్కర్షగా చెప్పారు.

శుభవార్త అని ఎందుకంటున్నానంటె భారతదేశం లాంటి దేశం మాంసం ఎగుమతి చేస్తోందంటె సిగ్గుపడాల్సిన విషయం. సౌదీ అరేబియాలో మాంసం దొరకకపోతే వేరే ఏ దేశం నించి అయినా తెచ్చుకుంటారు. మన కెందుకు? మనకు వాళ్ళ దగ్గర నుంచి ప్రతిగా వచ్చేది కేవలం ముడి చమురు! అది మనకు వేరే ఎక్కడైనా దొరుకుతుంది.

ఎగుమతి చెయ్యమన్న నినాదాన్ని రూపొందించిన వారి మెదడుని ముందు పరీక్ష చేయించాలి. ప్రపంచంలో నిత్యావసర వస్తువులను ఎగుమతిచేయలేని కొన్నిదేశాల్లో భారతదేశం ఒకటి. భారతదేశం స్వయం సమృద్ధి గల దేశం. ఏవో కొన్ని విషయాల్లో తప్ప అన్నిటినీ ఉత్పత్తి చేస్తుంది. ఉత్పత్తి చేయలేని వాటిని దిగుమతి చేసుకుంటూ వాటికి బదులుగా జనపనార, ప్రత్తి వస్త్రాలు, టీ, కాఫీలను ఎగుమతి చేస్తుంది.

ఇటీవల కొన్ని సంవత్సరాల నుండి మనం చేపలు, మామిడి పండ్లు, మేలురకం బియ్యం, కూరగాయలు ఎగుమతి చేస్తూ ఉన్నాము. అంతే గాక ఇప్పుడు అరటిపళ్లు, అనాస పళ్లతో సహా వివిధ రకాల పళ్లు ఎగుమతి చేయాలని ఒక పథకం వేస్తున్నారు. ఇందుకు బదులుగా మనకు లభించేదేమిటి? యంత్రాలు. మన దేశం ఏదో రాక్షసిలాగా రాత్రి, పగలు యంత్రాలనే తినేటట్లు!

యంత్రాల వల్ల లాభమేమిటి? కొందరికి నిరుద్యోగ సమస్య తీరుస్తుందేమో! ఇంతా చేస్తే మొత్తం పరిశ్రమల్లో పనిచేసే వారి సంఖ్య రెండున్నరకోట్లు. వారి కుటుంబ సభ్యుల్ని లెక్కకుతీసుకుంటె పన్నెండున్నరకోట్లు. ఇది మనదేశం మొత్తం జనాభాలో 5వ వంతు కన్నా తక్కువ. వేరే విధంగా చెప్పాలంటే అయిదుగురిలో నలుగురికి ఉపయోగపడే కూరగాయలు, పండ్లు, బియ్యం ఎగుమతి చేసి ఆ వచ్చినదానితో వారిలో ఒకరికి పని చూపగలుగుతున్నాము. ఇది వక్రమైన సామ్యవాదం. నెహ్రూలు, శ్రీమతి ఇందిరాగాంధీనే తమ వితండ వాదాలతో దానిని సమర్ధించ గలరు. బూటకపు ప్లానింగ్ కమీషన్, ఆర్థికవేత్తలు, నిపుణులు ఉన్నారంటే వాళ్ళ స్వార్ధం కోసం దేనినైనా వాళ్లు సమర్ధిస్తారు.




సంవత్సరంలో ఈ కాలంలోనే పల్లెలలో పండ్లు, కూరగాయలు సమృద్ధిగా పండుతాయి. నిస్సారమైన, రుచిలేని ఆహారం, ఒకోసారి అదీ లభించని పేద పల్లె ప్రజలకు కొద్దిగా రుచికరమైన ఆహారం లభించే రోజులు ఇవే. కాని, ఇప్పుడు వాళ్ళ నోళ్లు కొట్టినట్లయింది. పోయిన నెల బొంబాయిలో డజను మామిడిపండ్లు 100 రూపాయలకు అమ్మారు. నాసిరకం కూడా డజను 40 రూపాయలకు తక్కువ లేకుండా అమ్మడు పోయాయి. ఒకప్పుడు దక్షిణ బొంబాయి, కేరళ మధ్యనున్న కోస్తా జిల్లాల్లో బీదవాళ్లు తినే తక్కువరకం చేపలు ఒక రూపాయికి 10 చొప్పున అమ్మేవారు. 50 పైసలకు మంచి భోజనం లభించేది. ఇప్పుడు చేపలు, మామిడి పండ్లు డబ్బాల్లో పెట్టి అరబ్బు దేశాలకు ఎగుమతి చేసి ముడి చమురు ఎక్కువ ధరకి దిగుమతి చేసుకుంటున్నాం. ఇది వ్యాపారం అనిపించుకోదు. అభివృద్ధి పేరుతో జరుగుతున్న కుంభకోణంలాంటిది. ఇప్పటికైనా ప్రతిపక్షాలు ఈ సమస్యని వెలుగులోకితెచ్చి అభివృద్ధి పేరుతో జరుగుతున్న యిలాంటి మోసాలని ఆపటం ఎంతైనా అవసరం.

వాణిజ్య మంత్రి శ్రీ విశ్వనాథ్ ప్రతాప్ సింగ్ వ్యవసాయక ఎగుమతులకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తానని, అందుకోసం ఒక పథకం తయారుచేస్తున్నానని లోక్‌సభలో చెప్పారు. ఇంతకన్న తెలివితక్కువ పని వేరేలేదు. సగం జనాభాకన్నా ఎక్కువమందిలో దరిద్రం తాండవిస్తున్న, వ్యవసాయమే జీవనాధారమైన మన దేశం వ్యవసాయిక ఉత్పత్తులను ఏ విధంగా ఎగుమతి చేయగలదు. అభివృద్ధి పేరుతో సగం మంది కడుపులుకొట్టి ఈ పని జరుగదు. వ్యవసాయక ఉత్పత్తులకు సంబంధించినంతవరకు మనకు మిగులు అనేది లేదని శ్రీ సింగ్ అంగీకరించారు. ఒక కుటుంబం నెలకు 250 గ్రాముల పంచదార కొనలేని స్థితిలో ఉన్నదంటే మనకు కావలసినంత పంచదార ఉందని ఎలా చెప్పగలం? చాలా కుటుంబాలు ప్రతి రాత్రి ఆకలితో ఉంటూ, వారి పిల్లలకు సగం పాచిపోయిన రొట్టెముక్క పెట్టి కడుపు నింపుతున్నారంటే బియ్యం సమృద్ధిగా ఉన్నాయని ఎలా అనగలం? రాత్రులు తప్ప పగలు తమ చింకి బట్టలతో బయటకు రావటానికి ధైర్యం లేని బీహారు స్త్రీలను చూస్తూ మనది సమృద్ధిగల దేశం అని ఎలా అనగలం? ఈ మిగులు అన్నమాటే అబద్ధం. ఏ మంత్రి అయినా మనకి మిగులుగా ఉన్నవాటిని ఎగుమతి చేస్తాము అంటే అతను అబద్ధాలకోరయినా అయి ఉండాలి, లేదా విదూషకుడైనా కావాలి. మనదేశంలో మిగులు ఏదైనా ఉందంటే అది దారిద్ర్యం ఒక్కటే!

నేనెప్పుడు విదేశాలకెళ్ళినా పారిస్, లండన్‌లోని ధనవంతులయిన వారిని గమనిస్తేవారు మన జీడిపప్పు, మామిడి పండ్లు తింటూ కనిపిస్తారు. నిజానికి అవన్నీ మన పిల్లల నోళ్ళు కొట్టి ఎగుమతి చేసినవే. నా కసలు నిరాహారదీక్ష చేద్దామా అనిపిస్తుంది. అభివృద్ధి అనే పదానికి అర్థం లేకుండాపోయింది. పేదల నోళ్ళు కొట్టి, ధనికుల పొట్టలు నింపుతున్నారు, పారిస్, లండన్‌లోనే కాదు. బొంబాయి, కలకత్తా, మద్రాసులో పరిస్థితి కూడా ఇదే. ఎగుమతి ద్వారా సంపాదించింది వ్యవసాయదారునిదాకా చేరదు. పెద్ద పట్టణాలలోని పెద్ద చేపలు దానిని మింగేస్తాయి. సమాజానికి కొంత ఉపయోగకరంగా ఉంటే తప్ప ఏ అభివృద్ధి పథకం పని చేయదు. ఒకవేళ ధనిక వర్గాన్ని క్రిందికి దించకపోయినా ఫరవాలేదు కాని బడుగు వర్గాలను పైకి తెచ్చి సమాజంలో కొంత సమానత్వం తేవాలి. ప్రజలను బాధించే ఈ పద్ధతులని ప్రతిపక్షాలు మార్చాలనుకుంటే ముందు ఈ కృతకమైన అభివృద్ధి పేరిట వ్యవసాయక ఎగుమతులు ఆపివేయడం నుంచే ప్రారంభించాలి. మనం ఇప్పటికే మాడి చస్తున్నాం. మనల్ని ఇంకా మాడ్చినందువల్ల విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్‌గారికి వచ్చే లాభం ఏమిటి? 





# ప్రయాణాన్నే...!

కొప్పాక బాబు

ఈ రోజుల్లో ఎక్కడికైనా ప్రయాణం చేయాలంటే ఈ రద్దీవల్ల చాలా భయమేస్తుంది. అందులోను బస్సు ప్రయాణమైతే మరీను. ఎక్కడి సంగతో ఎందుకుగాని ఒంగోలు నుంచి మాత్రం పొదిలి బస్సుల్లో ప్రయాణం చేయలేం. ఎప్పుడు చూసినా బస్సులు రద్దీగానే వుంటాయి. డైరెక్టుగా పోయే బస్సులే కాకుండా నాలుగైదు ఊర్లకు పోయే బస్సులు కూడా పొదిలి మీదనుంచే వెళతాయి. అయినా సరే ఖాళీ వుండదు.

ఆ రోజు ఒంగోలులో పని చూసుకుని బస్‌స్టాండ్‌కు వచ్చాను. మార్కాపురం పోయే బస్సొకటి బయలుదేరడానికి సిద్ధంగా వుంది. ఈ బస్సులో పోదామనుకున్నాను కాని బయట నుంచి చూస్తేనే తెలిసిపోయింది, కూర్చోటానికి కాదు కదా కనీసం నిలబడటానికి కూడా చోటు లేదని. యిదిపోతే మళ్ళీ రెండు గంటలవరకు బస్సులేదు. అంతసేపు ఈ బస్‌స్టాండులో కాళీగా వుండటమంత బుద్ధితక్కువ పని యింకొకటి లేదు. అందుకే ఎలాగో ఒకలా పోవచ్చునని లోపలికి ప్రవేశించాను.

"నమస్కారం మాస్టారూ! యిక్కడ కూర్చోండి" కండక్టరు ప్రక్కనే కూర్చున్న ఓ కుర్రాడు లేచి అన్నాడు. అతనెవరో నాకు గుర్తుకు రాలేదుగాని అతనెప్పుడో నా దగ్గర చదువుకుని వుంటాడనుకున్నాను.

"ఫర్వాలేదు లేవోయ్" మనస్సులో కూర్చోవాలనివున్నా పైకి మాత్రం కొంచెం బెట్టు చేసాను.

"మీరు నిలబడలేరు సార్. మీరు కూర్చోండి నేను నిలబడతాను" అని నన్ను కూర్చోబెట్టాడు.

ఈ లెక్చరరుద్యోగం కనీసం ఈ మాత్రం గౌరవాన్నయినా కలిగించిందని మనస్సులో కాసేపు ఆనందపడ్డాను. అప్పటికే అందరికీ టిక్కెట్లిచ్చిన ట్లున్నాడు కండక్టరు తాపీగా కూర్చున్నాడు. నా దగ్గర కూడా టికెట్ రేటుకంటే ఓ ముప్పయి పైసలు (అలవాటుగా) ఎక్కువ తీసుకుని టికెట్టిచ్చాడు. టైమయినట్లుంది. బస్సు బయలు దేరింది.

బస్సులో డ్రయివర్, కండక్టర్లకు సీట్లు భద్రంగా వుంటాయి కాబట్టి మిగతావాళ్ళు ఎట్లా ఏడిస్తే ఏంలే అనుకుని ఎవరు చేయి చూపి ఆపినాసరే వాళ్ళని ఎక్కించుకుంటున్నారు. ఇంతకు ముందయితే బస్సు కాళీగా వున్నాసరే ఆపకుండా పోయేవారు. కాని ఈ బోనస్ సిస్టం వల్ల రోడ్డు ప్రక్కన నిలబడి ఎవరైనా నల్గురు మాట్లాడుకుంటుంటే ఆపి మరీ అడుగుతారు వస్తారా అని (వాళ్ళు ప్రయాణీకులు కాక పోయినా).

సరిగ్గా రింగ్‌రోడ్ దగ్గిరకి వచ్చేసరికి రోడ్డుమీద ఓ ముసలమ్మ రెండు చేతిసంచులను పట్టుకుని నిలబడి వుంది. ప్రజా సేవయే మా కర్తవ్యం అనుకునే ఈ యిద్దరూ ఆమెను యధావిధంగా ఎక్కించుకున్నారు. ఆమె లోపలి కొచ్చేదారిలేక గుమ్మం దగ్గరే నిలబడిపోయింది.

డోర్‌ని గట్టిగా వేసి దాన్ని తాడుతో కట్టి (ఊడిపోకుండా) కండక్టరు ముసలమ్మని "ఎక్కడి కెళతావ్" అని అడిగాడు.

"సీమకుర్తి బాబూ" అందామె.

"అయితే రెండు రూపాయలివ్వు" అంటూ ఆజ్ఞ జారీచేసి "యింకెక్కడ ఆపకు గురూ" అని డ్రయివర్‌తో చెప్పాడు.

బస్సు బయలుదేరింది.

"ఏం డబ్బులిమ్మంటుంటే... వినపడ్డం లేదా చెవుడేమిటి" అంటూ అరుస్తున్నాడు కండక్టరు. వీడిప్రక్కన ఎందుకు కూర్చున్నాన్రా భగవంతుడా అనుకున్నాను. అతను మాట్లాడుతుంటే వర్షం కురుస్తుంది. చుట్టకంపు కొడుతుంది. అసలు మనిషే కండక్టరులా లేడు. నలిగిపోయి వున్న కాకీ డ్రస్ వేసుకున్నాడు. జుట్టంతా చిందరవందరగా వుంది. గడ్డం కూడా మాసిపోయి వుంది. కండక్టరు సీటులో కూర్చున్నాడు కాబట్టి కండక్టరనుకోవాలిగాని అదే ఏ రోడ్డుమీదో కన్పిస్తే లారీ క్లీనరనుకుంటాం. ఆదాయం బాగానే వుంటుందిగా! కాస్త నీట్‌గా వుండకూడదూ ?

ఆ ముసలమ్మ చేతుల్లో వున్న సంచుల్ని కాళ్ళ దగ్గిర పెట్టుకుని ఓ సంచిలోని చిన్న గుడ్డమూట తీసి విప్పుతోంది. బస్ స్పీడుగా పోతుందేమో ఆ ముసలమ్మ నిలబడలేకపోతోంది. బస్ డోర్ పట్టుకుని మేనేజ్ చేస్తోంది. ఆ ముసలమ్మ మీద వూరకే రుసరుసలాడుతున్నాడు కండక్టరు. దానికి కారణం వేరే చెప్పనక్కరలేదు. ఆమె టికెట్ రెండు రూపాయలది. ఆమెవల్ల కండక్టరుకు లాభంలేదు. వాళ్ళకి ఒకటి ఎనభై, రెండు ఎనభై... యిట్లాంటి టికట్లయితే అంతా లాభమే. అందుకే అలాంటి పాసంజర్లను వీళ్ళు చాలా గౌరవంగా చూస్తారు. ఒకవేళ ఆ పాసంజర్లు పొరపాటున చిల్లర అడిగారా వాళ్ళని అంతమందిలోను పరువు తీస్తారు. వాళ్ళని అడిగి భంగ పడేకంటే ఆ డబ్బులతో టీ తాగామనుకుంటే సరిపోతుందని చాలామంది ఊరుకుంటారు.



# Hallmark DELUX

## అత్యంత ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో

IS 4246





## తయారుచేయబడిన
## స్టెయిన్‌లెస్ స్టీల్ గ్యాస్ స్టవ్

- శుభ్రపరుచుటకు వీలుగా Removable Stainless Steel Spill trays
- పాత్రలకు స్థిరమైన ఆధారాన్ని ఇచ్చే Pansupports
- ఇతర స్టాండుల అవసరం లేని Rubber feet
- ఇంధనం పొదుపుకై సమర్థవంతమైన Burners
- స్టౌ వేడి ఎక్కని ప్రత్యేక Design
- అయిదు పూర్తి సంవత్సరములు గ్యారంటీ.



Manufactured by :
**ORIENTAL APPLIANCES P. LTD.**
Madras 600 013




Marketed by :
**NISCHA-DEEP ENTERPRISES**
8, Victoria Crescent, Egmore,
Madras 600 105 Phone : 811403

6-1-67/19, Saifabad,
Hyderabad 500 004 Phone : 36719

29-4-17, Kothandarama Reddy Road
Arundelpet, Vijayawada 520 002

2, Nanjappa Road
Shanthi Nagar, Bangalore 560 027

Sista's-NDE-93.82R



**Hallmark** గృహ పరికరాలలో - ప్రత్యేక తరహా










# తవదాకా వస్తేనే...

ఎలా అయితే కష్టపడి ఆ మూట విప్పి రెండు రూపాయల కాగితాన్ని తీసి కండక్టరు కిచ్చింది. కండక్టరు టికెట్ యిచ్చాడు. ఆమె జాగ్రత్తగా ఆ టికెట్‌ను మూటలో కట్టి సంచిలో పెట్టేసింది.

టికెట్ల ప్రహసనం పూర్తయింది. ఎస్సార్ తీసాడు వ్రాయడానికి. వ్రాస్తూ వ్రాస్తూ ఏమనుమానం వచ్చిందో టికెట్స్ చేని తీసి చూసి కాసేపు తనలోతాను గొణుక్కుని ముసలమ్మని టికెట్ చూపించమన్నాడు. ఆమె మళ్ళీ కష్టపడి ఆ మూట విప్పి టికెట్ తీసి యిచ్చింది. బస్ స్పీడుగా పోతోందేమో డోర్‌ని గట్టిగా పట్టుకుంది. కాస్సేపు ఆ టికెట్ వంక, ఎస్సార్ వంక చూసి ఆ టికెట్‌ను డోర్ పట్టుకున్న ముసలమ్మచేతిలో పెట్టేసాడు. ఆమె ఆ టికెట్‌ను గట్టిగా పట్టుకుందామనే లోపలే అది గాలిలోకి ఎగిరిపోయింది. "అయ్యో నా టికెట్" అంటూ ఆమె అరవడం ప్రారంభించింది. కండెక్టరు బస్సు ఆపించేసాడు. "ఏం అంత వదులు చేతులా... ఆ మాత్రం ఆ టికెట్‌ను పట్టుకోలేవ్" అంటూ కండక్టరు ఆమెపై అరుస్తున్నాడు. బస్సు ఆగడంతో ముసలమ్మ, కండెక్టరు బస్సు దిగారు. కాని ఆ టికెట్ అప్పటికే ఎక్కడికో ఎగిరి పోయివుంటుంది. యింకేం దొరుకుతుంది? ఒకసారి బస్సు వెనక్కి వెళ్ళి తిరిగొచ్చాడు కండక్టరు.

ఆ ముసలమ్మ మీద కోపంతో మండిపడి మళ్ళీ టికెట్ కొనమన్నాడు. తన దగ్గర యింక డబ్బుల్లేవంది. టికెట్ పోవడం తన తప్పు కాదంది. టికెట్ ఎగిరి పోవడానికి నువ్వే కారణమంది. తను ముందు దాచుకున్నానంది. ఎన్ని చెప్పినా కండక్టరు వినలేదు. టికెట్ కొనాలన్నాడు. కొనకపోతే యిక్కడ దింపేసి పోతానన్నాడు. ధాంతో ఆమె గొల్లుమంది. మధ్యలో యిక్కడ దింపేస్తే తన గతేమిటంది. ఈ గొడవంతా బస్సులో వున్నవాళ్ళకి చాలా చికాకును కల్గిస్తోంది. అసలే నిలబడి ప్రయాణం చేస్తున్నారు. కూర్చున్న వాళ్ళకి కూడా సుఖం లేదు. అంతా విసుక్కుంటున్నారు. "పోనీ యిక్కడ ఎక్కించుకో గురూ. వచ్చే స్టేజి పెర్నమిట్టే గదా? అక్కడ దించేద్దాం" అన్నాడు డ్రయివర్.

అక్కడ దింపితే మాత్రం తను ఎలా వెళతానంది. చీమకుర్తిలో దించుతానంటేనే బస్సు ఎక్కుతానంది. ముసలమ్మ గట్టిదే ననిపించింది. నిజానికి ముసలమ్మ తప్పేమీలేదు. తప్పంతా కండక్టరుదే. అతని నిర్లక్ష్యంవల్లే ఆ టికెట్ ఎగిరి పోయింది. కాని ముసలమ్మది తప్పని దబాయిస్తున్నాడు. పోనీ నేను కలగజేసుకుని చెపుదామంటే నా మాట వింటాడా? నా కెందుకులే గొడవని వూరుకున్నాను. బస్సులో చాలా మంది ఈ ఆలస్యాన్ని భరించలేక తలోక పావలా యిస్తామన్నారు. దాంతో కండక్టరు, ముసలమ్మ బస్సెక్కారు. అందరూ యిచ్చిన (నేను కూడా) రెండు రూపాయలు తీసుకుని టికెట్ ముసలమ్మకిచ్చి బస్సును పోనిమ్మన్నాడు.

చీమకుర్తిలో బస్సు ఆగడంతో ముసలమ్మ దిగిపోయింది. అక్కడ చాలా మంది దిగిపోవడంతో బస్సంతా కాళీ అయిపోయింది. ఎక్కేవారు లేక పోవడంతో బస్సు వెంటనే బయలు దేరింది. డ్రయివర్ చాలా స్పీడుగా పోనిస్తున్నాడు.

రామతీర్థం దాటిన తర్వాత కండక్టరు ఎస్సార్ క్లోజ్ చేసాడు. ఒకసారి లేచి బస్సులో వున్న పాసంజర్లను లెక్క పెట్టుకున్నాడు. తర్వాత వెళ్ళి డోర్ దగ్గర నిలబడి తల బయటకి పెట్టి కాస్సేపు అటూ యిటూ చూసి అక్కడే వున్న అడ్డకమ్మీమీద కూర్చుని బేగ్‌లోని కేష్ లెక్కపెడుతున్నాడు. ముందు వందలు, ఏభైలు లెక్కపెట్టి బేగ్‌లో పెట్టుకున్నాడు. తర్వాత పదులు లెక్క పెడుతున్నాడు. బయటనుంచి వీస్తున్న గాలికి గుమ్మందగ్గరగావున్నాడేమో అతని తలంతా చిందరవందరగా ఎగురుతోంది.

స్పీడుగా పోతున్న బస్సుకు ఏమడ్డం వచ్చిందో డ్రయివర్ ఒక్కసారిగా స్టీరింగ్‌ను ప్రక్కకితిప్పి బస్సును రోడ్డుప్రక్కగా పోనిచ్చి మళ్ళీ రోడ్డుమీదకు తీసుకొచ్చి ముందుకు పోనిచ్చాడు.

అంత స్పీడులో ఆ సంఘటన జరిగేసరికి కండక్టరు బాలన్సు నిలుపులేక ముందుకు పడబోయి చేతిలోని నోట్లను వదిలేసి డోర్ పట్టుకున్నాడు. అలా చెయ్యడంలో ఒకటి రెండు నోట్లు బయటకి ఎగిరిపోయాయి. మిగిలినవి లోపలే పడ్డాయి.

"హోల్డాన్" అంటూ ఒక్క అరుపు అరిచి బస్సాపించాడు కండక్టరు.

"ఏంటి గురూ" అన్నాడు డ్రయివర్ తాపీగా.

"నా బొంద, అంత స్పీడులో ప్రక్కకి తిప్పకపోతే స్లోగా పోనిస్తే నీ సొమ్మేంపోయింది. యిప్పుడు చూడు నోట్లు ఎగిరిపోయాయి" అన్నాడు కోపంగా.

డ్రయివరు, కండక్టరు బస్సుదిగారు. అప్పటికే అవి చాలాదూరం వెళ్ళిపోయి వుంటాయి. దొరకలేదు. డ్రయివర్ బస్సెక్కి రివర్స్‌లో కొంతదూరం వెనక్కిపోనిచ్చాడు. అయినా ఫలితం దక్కలేదు. కండక్టరు ఏడుపు ముఖం పెట్టాడు. అతన్నిచూస్తే నాకు జాలి కలిగింది. ముసలమ్మ టికెట్ ఎగిరిపోతే ఆమెను తిట్టి నానా హంగామాచేసి మళ్ళీ టికెట్ కొనిపించిన ఈ కండక్టరు తను చేసిన పనికి ఏం జేయాలో తెలియక వచ్చి తనసీట్‌లో కూర్చుని బస్సును పోనిమ్మన్నాడు. ఏదైనా తనదాకా వస్తేనేగాని తెలియదంటారు. ★

# వారఫలం

10-6-1983 శుక్రవారం మొదలు 16-6-1983 గురువారం వరకు

♈ మేషం: అయినవారి సంబంధానికై కొందరు తాపత్రయ పడుతారు. అయినా లాభం? వృత్తిలో చాలమంది శ్రమకు గురి కాగలరు. పత్రికా వ్యాసంగానకొందరకు మేలు చేకూరుతుంది. స్త్రీలకు: బంధు విరోధం, వస్తువులు సేకరించుకోవటం, సంభవం.

♉ వృషభం: ఆదాయ మున్నది. కాని అంతకు అంత ఖర్చు కూడా చెప్ప దగిన సమయ మే. స్థిరాస్తిని గూర్చిన వివాదం కూడా సంభవం. చాలమందికి ఆదాయంలో అభివృద్ధి చెప్పదగిన సమయమే. స్త్రీలకు: సుఖ శాంతులు, ధన రాబడి, 'ప్రమోషన్' యిత్యాది శుభ ఫలితాలు ఉండగలవు.

♊ మిథునం: వారాంతానికి చాలా విషయాలలో మీకు అనుకూలత గలదు, ముఖ్యంగా రాజకీయ రంగంలో సర్వానుకూల్యత చేకూరుతుంది. ధన లబ్ధికి, ఉద్యోగమందు చేసిన ప్రయత్నాలకు అనుకూలత గలదు. నటనా విధానంగా ప్రావీణ్యత గల వారికి అప్రయత్నంగా సదవకాశాలుంటాయి. స్త్రీలకు: నగల సేకరణ, నూతన విషయ సేకరణకు అవకాశం గలదు.

♋ కర్కాటకం: 'ప్రతి వారం యింతేనా?' అనుకోకండి, గత కొన్ని వారాల కన్నా మేలు చేకూరగల సమయం. మీకు గల సాహితీ ప్రియత్వం నూతన రూపు దిద్దుకొంటుంది. స్త్రీలకు: కొందరకు ఉద్యోగ మందు 'ప్రమోషన్' చెప్ప వీలున్నది. కొందరకు నూతనోద్యోగాలు ప్రాప్తింపనున్నవి.

♌ సింహం: ఈరాశి జాతకులకు 'తృతీయ శని గ్రహస్థితి వలన యత్నించటమే తడవుగా అన్ని రంగాలలో విజయం చేకూరుతుంది. చాల కాలంగా ప్రయోజనకారి గాక నిలచిన ఒకానొక గృహ సంబంధ విషయంలో మేలు చేకూర నున్నది. ఉత్తరాల మూలంగా కొన్ని విషయాలు తెలిసికో గలరు. అవి ధన దాయానికి సంబంధించినవి. స్త్రీలకు: వృత్తి యుద్యోగాలలో పెంపు కనిపిస్తుంది.

♍ కన్య: చాలమందికి సంఘ గౌరవం చేకూరుతుంది. కొందరు సత్కార్యాచరణతో పేరు తెచ్చికో నున్నారు. కొందరకు అప్రయత్నంగా ఆశించిన కార్యానుకూలత, ధన లబ్ధికి అవకాశ మున్నది. ప్రయత్నిస్తే కొందరకు ఉద్యోగ లాభం సమకూడుతుంది. స్త్రీలకు: గృహ కార్య నిర్మాణమో! నూతన వస్తువులు సేకరించుటో, నూతన విషయాలు తెలిసికోవటమో జరుగుతుంది.

♎ తుల: 'సాహసా విధధీతవ క్రియా' సాహసించి ఏ కార్యం చేయ రాదు, అందులో ఈవారం అలాంటి సాహసానికి దిగరాదు, అలా చేస్తే ఆపద వెన్నాడుతుంది. రాశి యందు 'శని'గ్రహం స్థితుడై యున్నాడు. స్త్రీలకు: నూతన విషయ సేకరణ, బంధు ప్రీతి, సంఘ గౌరవాలకు అవకాశం గలదు.

♏ వృశ్చికం: ధనాదాయ మున్నది. మిత్రుల వలన, బంధు వర్గీయుల మూలాన అనుకూలత చేకూరటమే గాక, మీ అభీష్టం నెరవేరుతుంది. మతిమరపు అధికం కావటం మూలాన నూతన వస్తువులు పోగొట్టుకోవటం జరుగుతుంది వాహన ప్రమాదానికి కూడా గురి కావలసి వస్తుంది. జాగ్రత్త! స్త్రీలకు: ప్రయాణాల హడావుడి, కొందరకు ఉద్యోగ ప్రాప్తికి అవకాశ మున్నది.

♐ ధనుస్సు: మిత్ర వర్గంలో మీ మాటకు చెలామణి, సంఘంలో గౌరవం, అధికారుల మూలాన ఆశించిన పనులు సవరణ కావటం గమనించగలరు. పట్టుదలతో ఒకానొక కార్యాన్ని సాధింప దలచి మధ్యలో వదలారు. అలాంటి వ్యవహారం ఈవారం సాధింప బడుతుంది. స్త్రీలకు: దూర ప్రయాణాలకు అవకాశం, వ్యాపార మూలక లాభం వాహన ప్రాప్తి కొందరకు లభిస్తుంది.

♑ మకరం: అన్ని విధాలా మేలు చేకూరుతుంది. చాలమందికి ఉద్యోగ ప్రాప్తి, కొందరకు స్థితి యందు పెంపు, చేకూరే అవకాశ మున్నది. నూతన విషయాలు తెలిసికో నున్నారు. శుభ కార్యాలోచనలందు కొందరు నిమగ్నులు కానున్నారు. స్త్రీలకు: బంధు ప్రీతి, నగలో, నూతన వస్త్రాలో కొనే అవకాశం చేకూరుతుంది.

♒ కుంభం: ముఖ్య బంధువులు యింటికి రానున్నారు. దూర దేశాలకు కొందరు ప్రయాణించనున్నారు. అధికార వర్గం వలన కొందరకు మేలు సంప్రాప్తం, వ్యాపారం చేసే వారికైతే నూతన మార్గానుకూలత చేకూరుతుంది. అప్రయత్న ధనాదాయం కొందర విషయంలో చెప్ప దగిన అంశం. స్త్రీలకు: అధికార వృద్ధి, విద్యలందు పెంపునకు అవకాశ మున్నది.

♓ మీనం: చాలమందికి యత్న కార్య సిద్ధి, వ్యాపార లాభం, స్థితియందు పెంపు, వృత్తియందు మరొక అడుగు ముందుకుపోవటం, శుభ కార్యానుకూలత, యిత్యాది అనుకూలములు సిద్ధింప గలవు. స్త్రీలకు: సంఘ గౌరవం, సాహితీ మార్గాన అనుకూలత, 'సినీ రంగాన' అనుకూలత, నూతనాంశాల సంగ్రహణం చెప్ప దగిన అంశాలు, గ్రహించండి.

— *విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి* ★

# వ్యక్తిగతం



కర్నాటక ముఖ్య మంత్రి రామకృష్ణ హెగ్డే కనకపుర శాసనసభ నియోజక వర్గానికి జరిగిన ఉప ఎన్నికలో ఘనంగా గెలిచారు. జనవరిలో ఆస్థానం నించి గెలిచిన జనతా అభ్యర్థికి 13 వేల ఓట్ల మెజారిటీ వస్తే యిప్పుడు శ్రీ హెగ్డేకి 23 వేలకి పైగా మెజారిటీ లభించింది. నాలుగు మాసాల జనతా పాలనపై కర్నాటక ప్రజల తీర్పుగా ఈ విజయాన్ని ఆ పార్టీవారు భావిస్తున్నారు...



పాట్టి మెక్‌గ్యాయిర్ తన భర్త సుప్రసిద్ధ టెన్నిస్ ఆటగాడు జిమ్మీ కానర్స్‌తో కలిసి ఉండలేననీ, విడాకులు కావాలనీ కోర్టులో కేసు వేసింది. వీళ్లకి 3 సంవత్సరాల కొడుకు కూడా ఉన్నాడు. వివాహానికిముందు ఈమె 'మోడెల్'గా పనిచేసేదట...



డాక్టర్ మహేందర్ సింగ్ దహియా హర్యానాకి చెందినవాడు. లండన్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. అక్కడ నమిత అనే అమ్మాయిని పెళ్లి చేసుకుని 'హనీమూన్'కి బెల్జియం వెళ్లాడు. అక్కడ ఆయన తన భార్యని చంపి, ముక్కలు ముక్కలుగా కోసి రోడ్ పక్కన చెత్తకుండీలో పడేశాడట. చివరికి డాక్టర్ దహియా పోలీసులకి పట్టుబడ్డాడు...




## (గత సంచిక తరువాయి)

అప్పటి వరకూ చీకటిలో కూర్చుని యిదంతా గమనిస్తున్న అగంతకుడు లేచి అతడి చేతుల్లోని రాయిని విసురుగా లాగి అవతల విసిరేడు.

పద్మగంధి తేలికగా నిట్టూర్చి మామూలుగా తన చోట్లో వొచ్చి కూర్చుంది. కోపంతో ఊగిపోతున్న గోపాలదేవుడు ''ఎవడురా నీవు'' అంటూ ఉరిమేడు.

''ఎవరయితేనేమిలే. జరిగింది చాలదా, వెళ్ళు'' చాల నిర్లక్ష్యంగా జవాబు యిచ్చేడు అగంతకుడు.

''బ్రతికి బట్ట కట్టాలని లేదా ?'' గోపాల దేవుడు.

''నువ్వు బ్రతికి బయట పడాలనే ఉంది. అందుకేగా ఇక్కడ నుంచి వెళ్ళిపొమ్మని సలహా ఇచ్చేను.'' అగంతకుడు.

''నన్ను ఎదిరించే పాటి మగవాడివా ?''

''ఆడదాని చేతిలో చిత్తు అయ్యేవు. మిగిలి ఉన్న మూతి పళ్ళను భద్రంగా కాపాడుకో వెళ్ళి'' కసిరేడు అగంతకుడు. గోపాలదేవుడు రెచ్చిపోయేడు.

ఉష్ణీషాన్ని బిర్రుగా బిగించి కట్టి, ధోవతి చెంగులు బిర్రుగా దోపుకుని సర్రున ఒర నుండి కత్తినిలాగి అడుగు వెయ్యటం ప్రారంభించేడు.

అతడి వాలకం చూస్తే వీధుల్లో విలువిద్య ప్రదర్శించి పొట్టపోసుకునే ముసిలి వస్తాదులా ఉన్నాడు.

అగంతుడు పకా పకా నవ్వి అతనికి రిక్కి వేసి కవ్వించేడు. గోపాలదేవుడు మరింత వొంకర్లు తిరిగిపోతూ అడుగులు వేయసాగేడు.

అగంతకుడు అతడు అదాటున దాడిచేస్తే కాచుకుందుకు సిద్ధంగా నిలబడి చూడసాగేడు. ఒరనుండి కత్తిని మటుకు లాగలేదు. పద్మగంధి ఈ ప్రహసనం చూస్తూ నవ్వుతోంది.

''తియ్యరా కత్తి. ఈ రోజు నీ తలో నా తలో తెగిపడిపోవాలి'' హూంకరించేడు గోపాల దేవుడు.

''నీమీద కత్తిదూసి నా కత్తిని అవమానించుకోవాలని నాకు లేదు. నీ చేతిలో కత్తి ఉందిగా. రా ! ముందుకు. ఇంట్లో అందరికీ చెప్పకునేవచ్చావా?'' నిబ్బరం, వెక్కిరింపుగా అన్నాడు అగంతకుడు.

అతడి నిబ్బరం, నిండుదనం చూచి గోపాల దేవునికి మతి పోయింది. కత్తిదూసి తాను మీదికి వస్తున్నా అతడు చలించకపోవటం గోపాలదేవుని నైతిక బలహీనత బైటపడి పోవటానికి కారణ మయింది.

''చాతనైతే నాతో కత్తి యుద్ధంచెయ్యి'' అంటూ రెచ్చగొట్టాలని ప్రయత్నించేడు.

''లాభంలేదు, నీ రెచ్చగొట్టే మాటలు నామీద పనిచెయ్యవు. ఎందుకంటే కత్తి యుద్ధంలో నీకేపాటి ప్రావీణ్యం ఉన్నదో యిందాకటినుండీ నువ్వు వేస్తున్న ''అడుగు''ల వల్ల గ్రహించగలిగేను'' అంటూ అవహేళన చేసేడు అగంతకుడు.

ఆడదానిముందు తల తీసివేశినట్లు అయింది గోపాలదేవుడికి. ''ఏమి కూశావు' అంటూ ఒక్క ఉదుటున అగంతకుడి మీదికి దూకి కత్తి విసిరేడు.

అనుకోని విధంగా దాడిచేస్తే కాచుకుందుకు అంతకు ముందు నుండీ సిద్ధంగానే ఉన్న అగంతకుడు ప్రక్కకు లాఘవంగా దూకేడు. దూకుతూనే గోపాలదేవుడు కత్తి పట్టుకున్న చేయి మణికట్టుమీద ఒక్కపెట్టు పెట్టేడు.

సమ్మెటపెట్టులాంటి ఆ దెబ్బకు బాధతో మెలికలు తిరిగిపోతూ కత్తిని వొదిలివేసేడు గోపాలదేవుడు. భీతాహం నిండిన కళ్ళతో బిత్తర చూపులు చూడసాగేడు గోపాలదేవుడు. పద్మగంధి యిదంతా చూచి పకపకా నవ్వసాగింది.

మొదలే అవమానభారంతో కృంగిపోతున్న గోపాలదేవుడు పద్మగంధి పకాపకా నవ్వటంతో మరీ కృంగిపోయేడు.

''వెళ్ళు. వెళ్ళి ఉప్పూ, తవుడు వెచ్చచేసి కాపుకాయించుకో. యింకెప్పుడయినా యీ చాయలకు వొచ్చావో...'' అంటూ బెదిరించేడు అగంతకుడు. తన సామ్రాజ్యంమీద సర్వాధికారాలూ కోల్పోయిన మహారాజల్లే వెనుదిరిగి వెళ్లిపోయేడు గోపాలదేవుడు.

నాలుగడుగులు ముందుకువేసి వెనుదిరిగి అన్నాడు.

''యిప్పటికి యిలా జరిగిందని మురిసిపోకండి. యీ కథ యింతటితో ముగియలేదు. తెల్లవారేలోపు మీ బ్రతుకులు ఏమవుతాయో తెలుసుకోండి.'' బెదిరించి మరీ వెళ్ళిపోయేడు.

''పరదేశీ ! నా ఊహ నిజమే అయింది. వీడు ఒంటరివాడు కాదు. వీరివెనుకఉన్న శక్తులు బలీయమైనవే అయివుండాలి'' భయంతో హెచ్చరించింది పద్మగంధి.

''అయితే యిప్పుడు ఏమిచెయ్యాలని...?'' అడిగేడు అగంతకుడు.

''గొడవ పెరిగితే ఎందాకా పోతుందో...''

''ఎందాకాపోయినా తప్పు చెయ్యనివాళ్ళు ఎందుకు భయపడాలి ? ధర్మానికి విజయం లభించదా ?'' అగంతకుడు సూటిగ ప్రశ్నించేడు. పద్మగంధి అతని ముఖాన్ని పరిశీలించ సాగింది. అతని ముఖంలో భయం తాలూకు చిహ్నాలు లవలేశంకూడ కనిపించలేదు. ప్రశాంతంగా కనుపించేడు.

**జరిగిన కథ — 6 :** ఏకవీర కృష్ణస్వామి ఆశ్రమంలో పెరిగి పెద్దదవుతుంది. ఆమె స్వామిని ఆరాధిస్తుంటుంది. ఆమె శ్రీదేవుడిని ఒక చిన్న స్వామి రూపును చెక్కివ్వమని కోరుతుంది. మొగలిచర్లలో జైనాచార్యుని సభలు జరుగుతాయని తెలిసి కృష్ణస్వామి వ్యాకుల పడుతాడు. కృష్ణస్వామి తనకు లొంగి వచ్చేలా ఉండాలంటే ఏకవీరను తను కోడలుగా స్వీకరించేందుకు యిష్టం ఉన్నట్లుగా నటించాలనుకుంటాడు వెంకన్నదొర. ఏకవీర వెంకన్నదొర ఇంటికి వచ్చి ఆశ్రమానికి తిరిగి వెళుతూ ఏకవీరదేవి ఆలయంలో తను కృష్ణస్వామికి దొరికిన వృత్తాంతం అర్చకస్వామి ద్వారా తెలుసుకుంటుంది. ఆశ్రమానికి పద్మగంధి వస్తుంది, ఆమె విచారవదనం చూసి మంచి మాటలతో ఓదారుస్తుంది ఏకవీర. జైనాచార్యుడు గొప్ప పండితుడు, తాత్వికుడు. తను గతంలో పద్మగంధితో గడిపిన మధురక్షణాలు, ఆమెకు తనవల్ల ఒకవేళ శిశువు జన్మిస్తే ఆ శిశువును ఆమె పెంచకూడదు అని మాట తీసుకున్న వైనం జ్ఞప్తికి తెచ్చుకొని కలత చెందుతాడు. పద్మగంధి ఒక బిక్షకత్తె వేషంతో ఓరుగల్లులోని ఒక పాంథశాలకి చేరుతుంది. తను, పరదేశి కలసి గోపాల దేవునికి బుద్ధి చెప్పాలనుకుంటుంది.

''పరదేశీ! నువ్వెవరు?'' అన్నది పద్మగంధి.

''నువ్వే చెప్పావుగా నేనెవరో.''

''ఏమని చెప్పాను'' ఆశ్చర్యంతో అడిగింది పద్మగంధి.

''పరదేశినని.''

''గడుసువాడవే!''

''ముందు నువ్వెవరో చెప్పు'' అడిగేడు అగంతకుడు.

''చాల కఠినమైన ప్రశ్న వేశావు. సమాధానం నేను చెప్పలేను.''

''నువ్వెవరో నీకు తెలియదా?''

''నువ్వెవరో నీవు తెలుసుకున్నావా అన్న మాట'' అన్నది పద్మగంధి.

''నన్ను మాటల్లో పెట్టి చాల లోతుకు తీసుకుపోతున్నావు.''

''అంతుచిక్కని అగాధాల లోతుల్లోకి దిగి నాకు మిగిలిందేమిటి? నేనేమిటి? అని వెతుక్కో వటమేగా జీవితమంటే!''

''అయితే నీ ప్రయాణం ఎంతవరకో చెప్ప గలవా?''

''చెప్పగలను. విని ఏమిచేస్తావు?''

''చేతనైతే సాయంచేస్తాను?''

''నేను ఎవరినని నీవు నాకు సాయంచేయాలి పరదేశీ!''

''నాలాగే నీవూ పరదేశివికనుక'' అంటూ ఆమె మాట ఆమెకి అప్పగించేశాడు పరదేశి. ఇద్దరూ తేలిక అయిన హృదయాలతో మనస్ఫూర్తిగా నవ్వుకున్నారు.

నవ్వుతూనే పద్మగంధి కెవ్వున కేక వేసింది. వెనుకగా వచ్చిన గోపాలదేవుడు విసిరిన కత్తి వేటుకు పరదేశి తల ఎగిరి అవతల పడవలసింది.

పద్మగంధి అరచిన అరుపుతో హెచ్చరిక పొందిన పరదేశి ప్రక్కకు తప్పుకుని వెనుదిరిగి చూచేడు. గోపాలదేవుని వెనుక పదిమంది పటాల ముంది. నారంతా ముఖాలు గుర్తుపట్టటానికి వీలు లేకుండా జాగ్రత్త అయిన వేషధారణ చేసి ఉన్నారు. అందరి చేతుల్లోనూ కత్తులున్నాయి.

''జైనస్వామి పటాలంలోని వ్యక్తిని అవమాన పరచి నువ్వు ఈ భూమి మీద బ్రతికి బట్ట కట్టాలనే అనుకున్నావా?'' అంటూ మీది కురికేడు గోపాలదేవుడు.



## తిరుచరణాలు

"జై జైనదేవా !" అంటూ అందరూ ఒక్కుదుటున పరదేశి మీదికి లంఘించేరు. కాస్సేపు కత్తుల మ్రోతా హాహాకారాలూ తప్ప ఏమీ కనిపించలేదు.

ఒంటికి పట్టిన శ్వేదాన్ని తుడుచుకుంటూ వచ్చి పద్మగంధి ప్రక్కనే కూర్చుని రొప్పు తున్నాడు పరదేశి.

అతడి పరాక్రమాన్ని మననంచేస్తూ అతని ముఖంలోకి విస్ఫారిత నేత్రాలతో చూస్తోంది పద్మగంధి.

"పరదేశీ ! యిప్పుడయినా నీ పేరు చెప్పు" అన్నది పద్మగంధి.

"విని ఏమి చేస్తావు."

"మనసులో దాచుకుంటాను."

"ఇదేదో ప్రేమగొడవ కాదుకదా !"

"కాదు. కాదు. పరదేశీ ! అది కానేకాదు. నీ ధర్మదీక్షకు అంకితమైన నీ శౌర్య ప్రతాపాలు నాకు నచ్చాయి. అందుకు."

"నీవెక్కడకు పోతున్నావో చెప్పు ముందు."

"బెట్టు చేస్తున్నావా ?"

"కాదు. తెలుసుకోవాలని ఉంది."

"అక్కడకు చేరేందుకు సాయంచేస్తావా?"

"సాయంకాదు. స్వయంగా నేను వెంట వస్తాను."

"అయితే విను. నేను జైనస్వామిని చూడాలి" అన్నది పద్మ.

"అలాగా ! మరి నీవు కూడ విను. నా పేరు త్రిపురాంతక దేవుడు" అంటూ ఉష్ణీషాన్ని పూర్తిగా విప్పి ఆమె ముందు నిలిచేడు త్రిపురాంతకుడు.

పద్మగంధి విశాల నేత్రాలు ఆతని మీది చూపును మరల్చుకోలేక పోయాయి.

## 10

జైనస్వామి ముందూ ఆ వెనుక ఆహవమల్లూ నడుస్తున్నారు. అది దట్టమయిన అరణ్య ప్రాంతం. రామప్పగుడి నుండి వారు చాల దూరం వొచ్చేశారు. పాలంపేట చెరువు వెనుక పడిపోయింది. అరణ్య మార్గం అంత సుగమంగా లేదు. అలాంటి చోటు కావాలని ఎంపిక చేసుకున్నారు జైనస్వామి.

ఆయన మస్తిష్కం చాల సునిశితంగా పని చేస్తోంది. మతమూ రాజకీయమూ యీ రెండూ విడదీయరానివి అని ఆయన సిద్ధాంతం. ఇది కృష్ణస్వామి ఆలోచనలకు ప్రతిపధోరణి. అయితే జైనస్వామి దృష్టిలో కృష్ణస్వామి ఒక మామూలు సన్యాసి. జీవితంలో అందాలూ, ఆనందాలూ దక్కించుకోవాలంటే పోరాడాలి. పోరాటం అంటే భయపడే పిరికిపందలు మాత్రమే సన్యాసులుగా వేషం ధరించి సమాజం నుండి దూరంగా పారిపోతారని జైనస్వామి ఆలోచన.

కనుక ఆయన విషయంలో అంత ఆలోచించ వలసింది లేదని జైనస్వామి తలపోశాడు.

తన చూపులు అన్నీ శివదేవయ్య మీదనే! రాణీ రుద్రాంబ అన్ని ప్రతికూల శక్తుల్నీ అణచి వేసి నిశ్చింతగా పరిపాలించగలగటానికి మహా మంత్రి శివదేవయ్య ఒక్కడే కారణం. ఆయన ఏర్పరచిన యంత్రాంగం అంత పటిష్టమయినది. బలీయంగా శాఖోపశాఖలుగా విస్తరిల్లింది. ఆహవమల్లు చెప్పిన క్రొత్త వార్తలను ఆధారం చేసుకుని ఆలోచిస్తే పరిస్థితులు మారాయి. శివదేవయ్య కృష్ణస్వామి భుజస్కంధాలమీద చాల భారమే ఉంచారు.

అంటే కృష్ణస్వామి శక్తి సామర్థ్యాల మీదా, కార్యదక్షత మీదా శివదేవయ్యకు అచంచల విశ్వాసం ఏర్పడిందన్నమాట. స్వాభావికంగా వారిద్దరూ ప్రతికక్షులు కావలసింది. శివదేవయ్య పాశుపత శైవ అనుయాయి. కృష్ణస్వామి వైష్ణవుడు.

కాని తనను ఎదిరించి నిర్మూలించటం కోసం వారిద్దరూ ఒకటే అయ్యారని గ్రహించేడు జైనస్వామి. హిందువుల అశక్తతమీద అతనికి జాలివేసింది. ఒక్క రాజ్యాధికారం వారి చేతిలో లేకపోతే వారిని తరిమి తరిమి కొట్టవచ్చు. కాని ఆ రాజ్యాధికారం తన చేతిలో లేదు.

అది సంపాదించటానికి పెద్ద మొత్తంలో డబ్బు కాని, ప్రజల మద్దతు కాని కావాలి. తన దగ్గర అంత మొత్తంలో డబ్బు కూడ లేదు. కాబట్టి తాను రాజ్యాన్ని స్థాపించి హైందవాన్ని ఆంధ్రదేశంలో లేకుండా నిర్మూలించటానికి మిగిలివున్నది ఒకేఒక్క దారి. అది ప్రజాబలాన్ని సమీకరించుకోవటం.

ఆ సమీకరణకు జైన మహాసభలు ఊరూరా జరిపించాలి. వేలు లక్షల సంఖ్యలో అనుయాయుల్ని ఏర్పరచుకోవాలి. అదృష్టవశాత్తూ యింత వరకూ తాను చేసిన కృషి కొంత ఫలించింది. గ్రామాధికారులూ, నిమ్నవర్గాల ప్రజలలో కొంత భాగమూ యిప్పటికే జైనులయ్యారు.

ప్రతి గ్రామంలోనూ వారున్నారు. కాని స్వల్పమయిన సంఖ్య. ఆ సంఖ్యను పెంచాలంటే సభలు జరగాలి. అందుకే తాను మొగిలిచర్లలో జైన మహాసభను సంకల్పించాడు.

శివదేవయ్య మహామేధావి. వెంటనే తన ఆలోచన గ్రహించాడు. శాంతి యజ్ఞమంటూ ఒక నిర్వేతుక క్రియా కలాపాన్ని అక్కడ ఏర్పాటు చేస్తున్నాడు. యీ పిచ్చి ప్రజలు ఎటు మొగ్గు చూపటం ప్రారంభిస్తే అటే! తిరిగి ఆలోచించటమంటూ ఉండదు. వీరితో చాల బాధలు పడాలి.

హోమగుండంలో హవ్యం ప్రేల్చితే యీ హిందువుల మతులు పోతాయి. కేవలం ఆహారాన్ని పచనం చేసుకోవటానికి, చీకటి రాత్రుల్లో వెలుతురు కోసమూ ఉపయోగించే అగ్ని వీళ్ళకి దేవుడు. యీ పిచ్చి వీళ్లకి వదలదు.

ఈ బలహీనతను చాల తెలివిగా ఉపయోగించాలని సంకల్పించాడు శివదేవయ్య. యజ్ఞవాటికలో అగ్ని ప్రజ్వరిల్లగానే హిందువులకు మతులుపోయి అందులో జేరిపోతారు. మళ్ళా హైందవం తాలూకు నీడలు వాళ్ళ హృదయాల్ని ఆక్రమించుకుంటాయి. యిన్నేళ్ళుగా తాను చేస్తున్న కృషి కేవలం నిష్ఫలమైపోతుంది.

కనుక ముందు ఆ యజ్ఞం జరగకుండా ఆపుచెయ్యాలి. అది మొదటి పని. శివదేవయ్య మళ్ళీ యిలాంటి ఆలోచనలు తలపెట్టకుండా బాగా బుద్ధి చెప్పాలి. యిది రెండవ పని. ఒకవేళ యీ రెండు పనులూ సాధించలేక యజ్ఞం సఫలమైతే పూర్ణాహుతి నాటికి మొగిలిచర్ల చేరనున్న రుద్రాంబను తిరిగి ఓరుగల్లు ముఖం చూడకుండా అక్కడే తుదముట్టించాలి. యిది మూడవ పని. ఇవి సాధించాలంటే ఏర్పాట్లు చాల పకడ్బందీగా జరగాలి. సమర్థుడైన చారుడు కాబట్టి ఆహవమల్లుడు ఇప్పుడు ప్రధానమైన వ్యక్తి. ఇలా ఆలోచిస్తూ వెనుదిరిగి చూచేడు జైనస్వామి. ఆహవమల్లు ఆయన వెనువెంట నడుస్తున్నాడు తలవొంచుకుని.

''నాయనా! ఆహవమల్లూ! మరికొద్ది క్షణాలలో మనం నివసించే నేలమాళిగలోకి వెళ్ళుతాం. అక్కడ మన అనుయాయులు వందల సంఖ్యలో ఉంటారు. వారిలో కొందరు చారులు కూడ ఉండవచ్చు. కనుక నీవు సంయమనంతో ఉండాలి సుమా!'' అంటూ హెచ్చరించేడాయన.

ఆహవమల్లు తల ఎత్తి చూడసాగేడు.

అది చిన్న మంటపంలా ఉంది. ఆలయమని పూర్తిగా చెప్పటానికి లేదు. మూడు ప్రక్కల అయిదున్నర అడుగుల ఎత్తు గోడలున్నాయి. నిలువెత్తు కూడ లేవన్న మాట. ఒకప్రక్క ఊరికే వదిలివేసి ఉంది.

ఆ మంటపం పైకప్పుగా పలకరాళ్ళు పేర్చి ఉన్నాయి. లోపల అడుగున్నర ఎత్తు ఆంజనేయస్వామి విగ్రహం ఉంది. అది శిల్ప నిర్మాణ శాస్త్రరీత్యా సలక్షణమయిన శిల్పం. వెలుపల హిందూ సన్యాసి వేషధారణం చేసిన ఒక వ్యక్తి నిలబడి ఉన్నాడు. అతని కాషాయాంబరాల్లో కరవాలం కూడా ఉంది. అతడు జైనస్వామిని చూడగానే సైనికునివలె నిటారుగా నిలిచి అభివాదం చేశాడు.

జైనస్వామి అతడిని పిలిచేడు. అతడు సన్యాసివలె కాక సైనికునివలె నడచి వచ్చేడు.

బాగా దగ్గరకు వచ్చేక వచ్చేక జైనస్వామి అతడిని నఖశిఖ పర్యంతమూ బాగా పరీక్షించి చూచేరు. అతడు కదలక మెదలక అలాగే నిలిచేడు.

జైనస్వామి చేయెత్తి చాచి అతని చెంపమీద ఒక్క దెబ్బ వేసేడు. ఆ సన్యాసి వేషధారుడి కళ్ళు మూతలుపడ్డాయి. ప్రపంచమంతా ఒక్కసారి గిర్రున తిరిగినట్లు అనిపించింది. ఎలాగో నిల్రదొక్కుకుని ప్రశ్నార్థకంగా జైనస్వామి ముఖంలోకి చూచేడు.

జైనస్వామి ముఖం రవిబింబంలా మండుతోంది. ముఖంలోకి వెచ్చని నెత్తురు ఉబికింది.

ఇదంతా ఇలా జరిగిపోవటం ఏమిటో అర్థం కాక ఆహవమల్లు అత్యంత కుతూహలంతో చూడసాగేడు. అడగటానికి ధైర్యం చాలక పెదవి కదపలేదు.

అతడి కాషాయాంబరాలలోంచి పార్శ్వభాగానికి పొడుచుకువచ్చిన కరవాలం ఊగుతోంది.

''ఇదేమిటి?'' అంటూ ఆహవమల్లును ప్రశ్నించేరు జైనస్వామి.






# తిరుచరణాలు

కాషాయాంబరాల ముసుగులోఉన్న ఆ వస్తువును ఊహిస్తూ "కరవాలమ్" అన్నాడు ఆహవమల్లు.

"అర్ధమయిందా ?" ప్రశ్నించేరు జైన స్వామి. అయింది అన్నట్టుగా తలూగించి కత్తిని సవరించి దాచివేసేడు.

ఇప్పుడాతని వేషం సలక్షణంగా ఉంది. అతని ఉడుపుల్లో ఒక కరవాలం ఉన్నదని కని పెట్టటం ఇప్పుడు అసాధ్యమే !

"ఇక వెళ్ళు" అంటూ జైనస్వామి ఆజ్ఞా పించేరు. అతడు తన యధాస్థానానికి వెళ్లి నిలిచేడు.

ఇద్దరూ తలలువొంచి మంటపంలో జొర పడ్డారు. ఆ పద్ధతులు అన్నీ ఆహవమల్లుకు బాగా తెలుసు. అంజనేయస్వామి నడుముకు దగ్గరగా పట్టుకుని విగ్రహాన్ని పూర్వాభిముఖంగా ఉన్నదానిని పశ్చిమాభిముఖంగా త్రిప్పేరు. ఆ విగ్రహం తిరుగుతున్నప్పుడు కర్కశ శబ్ద మౌతోంది. బలవంతంగా త్రిప్పవలసివస్తోంది. ఆహవమల్లు పని పూర్తి అయేసరికి అతనికి చిరుచెమటలు పోశాయి.

విగ్రహానికి వెనుక నేలమీద పరచిఉన్న ఒక రాతిపలక ప్రక్కకు జరిగి దారి యిచ్చింది. అక్కడనుండి ప్రారంభమై అధోముఖంగా మెట్లు న్నాయి. అది నేలమాళిగలోనికి దారి.

మెట్లుమీదనుండి దిగటం కొంత చీకటి లోనూ, కొంత వెలుతురులోనూ. మెట్లు మొత్తం దిగేక బాగా వెలుతురు కనుపించింది. అది విశాలమయిన వసారా !

ప్రక్కగోడలకు పులిచర్మాలూ, జింక చర్మాలూ, కొన్నిజంతువుల తలలూ వ్రేలాడుతూ కనిపించేయి. వసారామధ్యలో ఒక పీఠం అమర్చి ఉంది. దాని ఎత్తు కొద్దిఅంగుళాలు మాత్రమే. దాని చుట్టూ జింక చర్మాలూ పరచి ఉన్నాయి.

జైనస్వామి ఒక జింక చర్మంమీద పద్మా సనం వేసుకుని కూర్చుంటూ ఆహవమల్లును మరొక ఆసనంమీద కూర్చోవలసిందిగా ఆదేశిం చేరు.

ఆహవమల్లు సంశయిస్తూనే మరొక జింక చర్మంమీద కూర్చుని జైనస్వామి చెప్పనున్న మాటలు వినేందుకు సంసిద్ధుడయ్యేడు.

"నాయనా ! ఆహవమల్లూ ! ఇంత వరకూ యీ ఉద్యమానికి అంకితమైన నా జీవితం కేవలం అడవుల్లోనూ, కొండ గుహల్లోనూ కొనసాగింది. సుందరపాండ్యుని వల్లా, రాచకొండ దేవరకొండ ప్రభువుల వల్లా నేను ఏదో కొంత చేయగలిగాను. ఇంకా చేయవలసింది చాల మిగిలి పోయివుంది. ఆంధ్ర మహాసామ్రాజ్య పాలకులైన కాకతీయులు నా మీద అకారణ వైరానికి పూను కున్నారు. వారిలో మత సహనం లేదు. వారి హిందూమతం మీద మనకూ నమ్మకం లేదు. ఇప్పుడు ఎవరు గెలుస్తారనే విషయం ప్రజల ముందుకు తీసుకు వెడుతున్నాం. జైన సభలు జయప్రదమయ్యాయా ప్రతి గ్రామంలోనూ మన ఉద్యమం శాఖోపశాఖలుగా వర్ధిల్లుతుంది. వారి అర్ధరహితమైన యజ్ఞయాగాలు జయప్రద మైతే ఇక మనకు భవిష్యత్తు లేదని తేలినట్లే కాగలదు.

కనుక ఇది చాల పరీక్షా సమయం. మనం జాగ్రత్తగా ఆలోచించి ఎత్తు వేయాలి. జైన సభలకు నేను వస్తానా రానా అనే విషయం ముందుగా ఎవరికీ తెలియకూడదు. నా సైన్యాన్ని తీసుకుని నేను రావలసిన సమయానికి వస్తాను.

యీలోగా అక్కడ జరుగవలసిన కార్య భారం నువ్వూ, వెంకన్నదొరా వహించాలి. సుందర పాండ్యవర్మ యిప్పటికే నాకు కొంత ధనం పంపేడు. అది తీసుకుని నీవు వెంటనే మొగిలిచర్ల గ్రామానికి వెళ్ళి అక్కడి పరిస్థితులు ఎప్పటికప్పుడు నాకు అందేలా చూడు. నీవు మాత్రం అక్కడ నుండి కదిలిరాకు. నీకు అన్ని నిర్ణయాలు తీసుకునే అధికారం కల్పిస్తూ నేను అధికార పత్రం ఒకటి యిస్తాను. దానితో అవుసరమనిపించి నప్పుడు అక్కడికక్కడ నిర్ణ యాలు తీసుకునే అధికారం నీకు లభిస్తుంది. కృష్ణస్వామిని నీవు వేయికళ్ళతో కనిపెట్టి ఉండాలి. అవుసరమైతే కృష్ణస్వామిని వధించి పీడ వదిలించుకో."

"అది అసాధ్యం స్వామీ" అన్నాడు ఆహవమల్లు. అప్పటి వరకూ మౌనంగా వింటూ ఊరకుండిపోయిన ఆహవమల్లు యీ విషయాన్ని వింటూనే వ్యతిరేకంగా సమాధానం చెప్పటం జైనస్వామికి విచిత్రంగా తోచింది.

"ఎందువల్ల ?" అన్నారాయన కుతూ హలంతో.

"ఆ గ్రామంలో వేయిమంది హరిజనులు న్నారు. కృష్ణస్వామి మీద యీగ వాలినా వారు సహించి ఊరుకోరు."

"హరిజనులంతా వెంకన్న పక్షం వహిం చారని విన్నాను..." అంటూ ఆగిపోయాడు జైనస్వామి.

"అదంతా నిజమేనని మనం తలపోశామంటే కృష్ణస్వామిని గురించి మనకు ఏమీ తెలియదని అర్థం. హరిజనులు అవసరానికి తలలొంచిన మాట యధార్థమైతే కావచ్చు కాని వారు కృష్ణస్వామిని విడిచి వస్తారనుకోవటం పొరపాటు. అది నిజమని నమ్మాడంటే వెంకన్నదొరకు ఆలోచన నశించిందని అనుకోవాలి. యీ విషయంలో నాకున్న అభిప్రాయం ఇది" అంటూ ముగించేడు ఆహవమల్లు. యీ విషయంలో ఆహవమల్లు ఆలోచనలు విన్నాక మొగిలిచెర్లలో ప్రజలు ఎంత మేధావులో తెలిసి వచ్చింది జైనస్వామికి. ఆయన తన భారం మరింత పెరిగినట్లు భావించారు.

"అయితే నాయనా ! ఆ గ్రామంలో మన పక్షం వహించేవారు ఎందరున్నారు ?" అని ప్రశ్నించేడాయన.

"కొద్దిమంది ఉన్నారు. వెంకన్నదొర కృషివల్ల ఆ సంఖ్య యిప్పటికి మరింత పెరిగింది."

"నీవు కూడ వెళ్ళి మరికొంత కృషి చేయాలి." జైనస్వామి యిలా చెప్తూ ఉండగానే కొంతమంది వ్యక్తులు అక్కడకు ప్రవేశించారు. వారి వస్త్రధారణ చూచి సైనికులు కారని గ్రహించేడు ఆహవమల్లు.

"ఆహవమల్లూ ! వీరంతా శిల్పులు. వీరు మొగిలిచెర్ల వెళ్లేందుకు సిద్ధంగా ఉన్నారు. వీరిని నీ పర్యవేక్షణలో ఉంచుకుని కావలసిన అంశాల్ని నిర్మించుకో. అన్నివిధాలా మన శిల్పాలు అధికంగా ఉండాలి. ప్రజల్ని బాగా ఆకట్టుకోవాలి. తెలిసిందా."

ఆహవమల్లు అవునని తల ఊపేడు.

ఒక సైనికుడు వచ్చి అభివాదం చేసి "అంతా సిద్ధమయింది" అంటూ విన్నవించేడు. జైనస్వామి లేచేరు. వెనువెంట ఆహవమల్లూ లేచేడు. శిల్పులు వెంటరాగా ముందుకు సాగారు.

వసారా దాటాక లోపల చిన్న చిన్న గదులు న్నాయి. ఒక గది ముందు ఆగేడు జైనస్వామి. అది ద్రవ్యనిధి.

ఒక సేవకుడు తలుపు తెరిచేడు శిల్పులు వెలుపలే ఉండగా యిద్దరూ లోపలకు వెళ్లి జైన మహాసభలకు అవుసరమయ్యే ద్రవ్యం సంచుల్లో కట్టి సిద్ధంగా ఉండడం చూచేరు.

వాటిని ఆహవమల్లుకు స్వాధీనపరచినట్లు ఒక పత్రం వ్రాయించుకుని అతనికి స్వాధీనపరచి "త్వరగా మొగిలిచర్ల వెళ్లాలి" అంటూ మరొక హెచ్చరిక చేసి వెళ్లిపోయేరు జైనస్వామి.

ఇటీవల చిలకలూరిపేటలో 'కళా సదస్సు' అఖిలభారతస్థాయిలో నిర్వహించిన నాటక పోటీలలో 'వేట కుక్కలు' నాటకానికి ఉత్తమ ప్రదర్శన బహుమతిగా బహురూప సమాఖ్య (వైజాగ్)కి రోలింగ్ షీల్డుని అందజేస్తున్న డా. కందిమళ్ల జయమ్మా నారాయణమూర్తి.



# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."

## నైసిల్

ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే,
చెమటకాయల పౌడర్.






2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

## నైసిల్ తెచ్చుకోండి
## చెమటకాయల బాధ మరిచిపోండి.

ప్రత్యేకమైన ఔషధ యుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి స్థితిలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మజీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

ద్రవ్యాన్ని, శిల్పులనూ, ఇంకా కావలసిన వస్తు సంచయాన్నీ తీసుకుని మొగిలిచర్లకు అభిముఖంగా బయలుదేరేడు ఆహవమల్లు.

గుర్రాలు మొగిలిచర్లకు బయలుదేరినాయి.

అర్ధరాత్రి దాటుతూవుండగా మొగిలిచర్ల పొలిమేర త్రొక్కారు వారు. గ్రామానికి దగ్గర లోనే ఉన్న వెంకన్నదొరగారి తోటలో విడిది చేసేరు వారు. హుటాహుటిన వెంకన్నదొరకు వార్త వెళ్ళింది.

ఆయన అంతకన్నా వేగంగా బయలుదేరి విడిది దగ్గరకు వొచ్చేరు.

"జైనస్వామి కుశలమా?" అని ప్రశ్నించేడు వొస్తూనే.

అంతకుపూర్వమే అక్కడ ఒక కుటీరం నిర్మించబడివుంది. వారు తెచ్చిన సామాగ్రి మొత్తం ఆ కుటీరంలోకి తరలించేరు. శిల్పులు కూడ కుటీరంలోకి వెళ్ళేరు.

"జైనస్వామికి కుశలమే! ద్రవ్యంకూడ పంపేరు."

"సభలు ఎప్పుడని నిర్ణయించేరు. వైశాఖ పూర్ణిమకేనా!"

"అందులో కొద్ది మార్పు జరిగింది."

"ఏమిటా మార్పు. ఎందుకు?"

"అవుసరమైన మార్పే. కృష్ణస్వామి అన్ని అవరోధాలను అధిగమించి యజ్ఞం పరిసమాప్తి చెయ్యగలిగితే పూర్ణాహుతి నాటికి జైన సభలు జరుగుతాయి."

"ఓహో! అదే సబబు" అన్నాడు వెంకన్నదొర ఆలోచిస్తూ.

"మహాసభలకు ఉద్దేశించిన నిధిని మీ స్వాధీనంలో ఉంచుకోండి. హరిజనుల విషయం ఏమయింది" అడిగేడు ఆహవమల్లు.

"వాళ్ళ బ్రతుకులు నా చేతుల్లో ఉన్నాయి. కూటికి గతిలేకపోయినా మతం కావాలిట వీళ్ళకి. ఆ విషయం నేను చూస్తాను."

"శ్రీ దేవుడు యజ్ఞ మంటపం నిర్మాణం ప్రారంభించేడా?"

"అనే వింటున్నాను."

"ఎక్కడ ఆ నిర్మాణం."

"కృష్ణస్వామి ఆశ్రమానికి ఆనుకునే."

"జైన సభా మంటపమూ, ప్రధాన ద్వారమూ కృష్ణస్వామి ఆశ్రమానికి దూరంగా మరో దిక్కుగా ఉండాలి."

"అలాగే మీరు వెళ్ళిపోతారా?"

"లేదు. సభలు అయ్యేవరకూ యిక్కడే ఉంటాను."

"సంతోషం. నా జీవితం ధన్యమయింది. నేను చూచుకోవలసిన పనులున్నాయి. మీరు విశ్రాంతి తీసుకోండి. మీరు ఉండే విడిది ఎక్కడుండాలో ఆలోచించి నిర్ణయిస్తాను. చూచుకోవలసిన పనులు చాల ఉన్నాయి" అంటూండగానే అరుణోదయమయింది.



# తిరుచరణాలు

వెంకన్నదొర వెళ్ళిపోయేడు.

పోతూ దారిలో ఏకవీరాదేవి ఆలయం దాపులకు వచ్చేక ఒక వ్యక్తి ఎదురురావటం గమనించి ఆగేడు.

"ఎవరూ? నారాయణా! నువ్వా!" అన్నాడు.

"వెంకన్నదొరకు వేయి దండాలయ్యా. అవును నేనే నారాయణని. ఇంత ఉదయమే..." అంటూ అర్ధోక్తిలో ఆగేడు.

"ఎక్కడకు పోతున్నావు?"

"ఆలయానికి. అమ్మ దర్శనానికి."

## పుస్తకం

ఇదిగో!
నువ్వంటే నాకెంతో యిష్టం.
అందమైనదానివని కాదు,
నా హస్తానికి
ఓ ఆభరణానివనీకాదు,
నా పుస్తకాల అరకు
వెన్నెతెచ్చిన దానివనీకాదు,
మరి —
విశాలమైన భావాలను
విప్పిచూపే దానివని!
విస్తృతమైన విశ్వాన్ని
కనులముందుంచే దానివని!!
ప్రేమానురాగాల అమృత ధారల్ని
విజ్ఞాన దీపికల వెలుగు రేఖల్ని
హృదయాంతర్గత గీత మాలికల సారాన్ని
అనుభవింప జేసే దానివని!!!

— దొడ్లంకి వెంకట్రావ్

"ఇంకా మీకు యీ పిచ్చి వొదలలేదన్న మాట."

"పుట్టుకతోవొచ్చింది దొరా! రక్తంలో ప్రవహించేది."

"అలాగేం. నీవు పుట్టినప్పుడు ఎలా ఉన్నావో ఇప్పుడూ అలాగే ఉన్నావా? ఎదిగి పోలేదూ?"

నారాయణ మాట్లాడే అవకాశంఉండీ, సమాధానం సిద్ధంగానే ఉండీ అతడు వెంకన్న దొరకు ఏ సమాధానమూ చెప్పలేకపోయేడు.

దొర తన ప్రశ్నకు నారాయణ సమాధానం చెప్పలేకపోవటం తన విజయానికి సూచినగా భావించి పొంగిపోయేడు. మధురంగా నవ్వేడు.

"యీ రాళ్ళూ రప్పలూ నీ కడుపు నింపుతాయా? నీ తెలివితేటలతో వొచ్చిన అవకాశాల్ని నీకు అనుకూలంగా మలుచుకోవాలి. విజయవంతమైన సాధన అంటే అదే. అదే జీవిత సాఫల్యంకూడా" అన్నాడు.

"మన తెలివితేటలుకు మించిపోయిన ప్రకృతి వైపరీత్యాలూ, బ్రతుకులో ఎదురయ్యే అర్ధంకాని చీకటికోణాలూ ఎదురైనప్పుడు ఏమి చెయ్యాలి దొరా? నా మనసులో ఏదో బాధ వుంది. ఆ బాధ ఎందువల్ల కలిగిందోకూడ నేను గ్రహించలేని స్థితిలో ఉన్నాను. దీనికి అర్ధం ఏమటి? ఇప్పుడు నేను చెయ్యవలసింది ఏమిటి?" అంటూ ప్రశ్నించేడు నారాయణ. దానికి సమాధానం వెంకన్నదొర దగ్గరలేదు. అలా అని అంగీకంచటమూ యిష్టంలేదు.

"నీకు అర్ధంకాలేదని అర్ధంకాని మరో శక్తిని ఆశ్రయిస్తాయి. యిది అమాయకత్వం కాదూ?"

"అర్ధంకానిది మరోశక్తికాదు. అది పరాశక్తి. అమ్మ ముందు చేతులు జోడించి నిలిస్తే మనసు ప్రశాంతమౌతుంది. మనశ్శాంతి దొరికేచోటుకు మనిషివెళ్ళటంలో తప్పేముంది" అన్నాడు నారాయణ.

"నీవు జైనాన్ని స్వీకరించావు..." అంటూ ఉరిమాడు వెంకన్నదొర తన ఆధిక్యత చాటుకుంటూ.

"అలాగనే మా సంఘం నిర్ణయించింది."

"యీ మొగిలిచర్ల గ్రామంలో జైన సంఘానికి నాయకుడు ఎవరనే విషయం నీవు గ్రహించలేదా?"

"గ్రహించకుండా ఎలా ఉంటాను. మీరు మాకు నాయకులన్న విషయం ఎలా మరచిపోతాను దొరా!"

"అయితే ఇక నుండీ ఏ హరిజనుడూ ఏకవీరాదేవి ఆలయానికి వెళ్ళరాదు, ఇది నా ఆజ్ఞ"

నారాయణకు కంటి నిండుగా నీరు క్రమ్ముకుంది. హృదయాన్ని గుప్పిటిలో పెట్టి ఎవరో పిండినట్లు అయింది.

"అలాగే దొరా!" అన్నాడు పూడిపోతున్న స్వరాన్ని పెగుల్చుకోవాలని విఫలయత్నం చేస్తూ.

దొర విజయగర్వంతో మీసం మెలివేసేడు.

అంతలో బిజ్జలుడు హడావుడిగా అటుకేసి వెళ్తూ తండ్రీ, నారాయణా ఏదో గంభీరముద్రలో ఉండటం గమనించి ఆగిపోయేడు.

"బిజ్జలా ఎక్కడకు నాయనా పోతున్నావు?" ప్రశ్నించేడు.

"ఏకవీర దర్శనానికి పోతున్నాను" అన్నాడు బిజ్జలుడు. ఆ సమాధానం వెంకన్నదొరకు పూర్తిగా అవగతం కాలేదు. బిజ్జలుడి అమాయకత్వం అప్పుడప్పుడూ హఠాత్తుగా మాయమై పోతుంది. మేధావిలా ప్రవర్తిస్తాడు?

(ఇంకా వుంది)

"A **MASS ENTERTAINER** WITH A TOUCH OF MESSAGE"




నిర్మాత: **క్రాంతికుమార్** దర్శకత్వం: **ఎ.కోదండరామిరెడ్డి** సంగీతం: చక్రవర్తి మాటలు: సత్యానంద్ కెమెరా: వెంకట్

ఆంధ్ర: శ్రీ శాయి కంబైన్స్ ; నైజాం: యస్.యస్.పి. సీడెడ్: వి.యం.సి.

# మేధావుల వలస సమంజసమా?

## వలసల వలన కలిగే ప్రయోజనాలు

ఈ ప్రశ్నకు సమాధానం ఇచ్చేముందు 'మేధావి' అన్న పదాన్ని నిర్వచించటం అవసరం. మేధావి అనేవాడు నా దృష్టిలో ఒక కళలో లేదా శాస్త్రంలో ప్రావీణ్యత సంపాదించినవాడు. ఇంజనీర్లు, డాక్టర్లు, శాస్త్రజ్ఞులు ఈ మేధావి వర్గంలో ప్రముఖులు. మేధావికి జాతి, కుల, మత, దేశ సరిహద్దులు లేవు అతడు విశాల విశ్వానికి చెందినవాడు. అతని మేధా సంపత్తి సమస్త మానవాళి భవితవ్యానికి ఉపయోగ పడాలి అందుచేత మేధావి తన మేధా సంపత్తి వికసించటానికి అన్ని విధాలా అనువైన ప్రదేశంలో ఉండవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

ఈనాడు మన దేశానికి చెందిన షుమారు 15,000 మంది డాక్టర్లు, 5200 మంది ఇంజనీర్లు, 3740 మంది శాస్త్రజ్ఞులు విదేశాల్లో ఉన్నారంటే దానికి ప్రముఖంగా రెండు కారణాలు –

1 మన దేశంలోని కళాశాలల్లో, విశ్వవిద్యాలయాలలో సీట్లు అతి తక్కువ సంఖ్యలో లభించటం, ఒకవేళ సీటు లభించినా మనకు నచ్చిన విషయంలో విద్య కొనసాగించటానికి అవకాశం లభించక పోవటం.

2 పరిశోధనకి, విద్య సాధనకి సరైన పరికరాలు, సదుపాయాలు, వాతావరణం లేకపోవటం.

డా ఖొరానాను భారతదేశంలో ఊహించు

*(గత సంచిక తరువాయి)*

కోండి. ఆయన ఏదో ఒక సామాన్య ఉద్యోగంలో సగటు భారతీయ పౌరునిగా తన మేధాశక్తిని వృధా చేసుకునేవారు. కానీ ఈరోజు ఆయన పరిశోధన వల్ల విజ్ఞాన శాస్త్రం పొందిన లాభం వర్ణనాతీతం దానికి ముఖ్య కారణం ఆయన అమెరికాకు వలస వెళ్లడమే!

వలస వెళ్లిన వారందరికి దేశభక్తి, మాతృభూమి అంటే మమకారం లేదనుకోవటం అవివేకం. వారు ఎక్కడున్నా వారి విజయాలు మనకి గర్వకారణాలు. మొన్న మొన్న అమెరికా 'స్పేస్ షటిల్' ద్వారా సృష్టించిన సంచలనం వెనుక అనేకమంది భారతీయుల అచంచల కృషి ఉందని విన్నప్పుడు ప్రతి భారతీయుడి హృదయం ఆనందంతో ఉప్పొంగింది.

అంతేకాదు విదేశాల్లో ఉన్న భారతీయ సోదరులు పంపే విదేశీ మారక ద్రవ్యం మనదేశ ఆర్థిక వ్యవస్థను పటిష్టం చేయటంలో ప్రముఖ పాత్ర వహిస్తోంది. కేవలం ముడి పదార్థాలు తప్ప ఎగుమతికి ఏమీలేని మనదేశ ఆర్థిక వ్యవస్థ దృఢంగా ఉందంటే దానికి ముఖ్యకారణం వారు పంపే విదేశ మారక ద్రవ్యమే.

కాబట్టి ఈ దేశానికి వెన్నెముక అయిన మేధావి వర్గ ప్రతినిధిగా మేధావుల వలస ఎంతైనా సమర్థనీయం అని దృఢంగా నమ్ముతున్నాను

**వి. రాజేంద్రకుమార్**
బి టెక్ (ఫైనల్) (ఎలక్ట్రానిక్స్)

**వి. రాజేంద్రకుమార్**

ఇంగ్లీషు, హిందీ భాషలలో కథలు, కవితలూ వ్రాయటం నాకున్న హాబీలు. అస్సాం సాహిత్య అకాడెమీ వారు అస్సామీ భాషలో నిర్వహించిన వ్యాసరచన పోటీలో మొదటి బహుమతి పొందాను. సాహిత్యం సమాజానికి దర్పణం కావాలని సమకాలిక, దేశకాల పరిస్థితులు ప్రతిబింబించని సాహిత్యం సాహిత్యమే కాదని భావిస్తాను.



**ఎస్. చంద్రమోహన్**

అప్పుడప్పుడు కాలక్షేపం కోసం కథలు చదివినా, రెగ్యులర్‌గా చదివే అలవాటు మాత్రం లేదు హైస్కూలు లోను, కాలేజి లోను జరిగే వ్యాసరచన, వక్తృత్వపు పోటీలలో పాల్గొన్నాను. చదువు, చదరంగం ముఖ్య వ్యాసంగాలు. నా అభిమాన రచయిత యండమూరి.



## హర్షదాయకమే

అనాది నుండి అన్ని రంగాలలో వెలుగు చూపిన మన దేశంలో ఎంతో మంది మేధావులు వెలిసారు. ఈ నాటికీ మన దేశంలో అన్ని రంగాల లోను, *సమర్థులైన ప్రతిభావంతులు ఉన్నారు వారందరికీ సరియైన సదుపాయాలు కలిగించి ప్రోత్సహించి నట్లయితే వారు తమ తమ రంగాలలో, మరిన్ని విజయాలు సాధించగలరు శాస్త్రీయంగా, సాంకేతికంగా ఎంతో వృద్ధిచెంది, క్షణ క్షణం సాంకేతిక పరిజ్ఞానం ముందడుగు వేస్తున్న ఈ అణు యుగంలో, ఏ వ్యక్తీ కేవలం తన ప్రతిభ మీద ఆధారపడి పరిశోధనలు సాగించలేడు ప్రపంచం లోని నూతన పరిశోధనల ఫలితాలు, అధునాతన మైన పరికరాల సహాయంతో అతడు తన పరిశోధనలు సాగించవలసి ఉంది దురదృష్టవశాత్తు, ప్రస్తుతం ఆర్థికంగా, సాంకేతికంగా వెనుకబడిన మన దేశం అటువంటి వసతులు కల్పించగల పరిస్థితిలో లేదు. ఈ కారణం వల్ల మన దేశంలో ఎంతోమంది ప్రతిభావంతులైన సాంకేతిక నిపుణులు తమ మేధశక్తిని పూర్తిగా ఉపయోగించు కొనలేక పోతున్నారు. మన దేశపు ప్రఖ్యాత గణిత శాస్త్రవేత్త శ్రీ రామానుజన్ సరియైన శిక్షణ లభించి ఉంటే మరెన్నో విషయాలను ప్రపంచానికి వెల్లడి చేసి ఉండేవారు కళలకు, శాస్త్రాలకు, ఆర్థిక, సామాజిక ఇబ్బందులు హద్దులు కాకూడదు అవి సమస్త మానవాళికీ ఉపయోగపడాలి. [ప్రఖ్యాత శాస్త్రవేత్త, నోబెల్ బహుమతి గ్రహీత శ్రీ ఖొరానా అమెరికా లోని పరిశోధనల వలననే మానవాళికి ఎన్నో క్రొత్త విషయాలు తెలిసాయి] మన దేశంలో ఆర్థిక, సాంకేతిక కారణాల మూలంగా తమ ప్రతిభను చూపలేని మన మేధావులు, పాశ్చాత్య దేశాలలోని ప్రోత్సాహకర వాతావరణంలో మరిన్ని క్రొత్త విషయాలు మానవాళికి అందించ గలిగితే అది హర్షదాయకమే.

**— ఎస్. చంద్రమోహన్**
3/4 బి. టెక్ (ఎలక్ట్రానిక్స్)

## విశాలభావం అలవడాలి

వైజ్ఞానికంగా ఎంతో అభివృద్ధి చెందిన, సాంకేతికంగా ఎంతో పురోభివృద్ధి సాధించిన విదేశాలకి మన దేశ మేధావులు తమ విజ్ఞానాభివృద్ధి కొరకు సహజంగా వెళ్లక తప్పదు. అది విజ్ఞాన తృష్ణ. విదేశాలలో ఉన్నత చదువులు చదివిన వ్యక్తికి మన దేశంలో తగిన ఉద్యోగం దొరకదు. కాని అదే విదేశాలలో తనకు తగిన ఉద్యోగము లభిస్తుంది. మరి అప్పుడు ఆ వ్యక్తి ఏం నిర్ణయించుకుంటాడు? తన చదువుని వృధాపరిచే స్వదేశ నివాసమా? వృద్ధిపరిచే విదేశ నివాసమా? ఈనాడు మన దేశంలో పెద్ద అధికారులకు తగినంత స్వతంత్రము ఉన్నదా? ఎంతోమంది ఉన్నతాధికారులు కేవలం రాజకీయ నాయకుల చేతిలో కీలుబొమ్మలు. భారీ ప్రయోగాలు చేయటానికి తగినంత ఆర్థిక స్థోమత,

# డాక్టర్ సలహాలు

### టి. జి. ఆర్. – పిప్పర

నాకు గత 4 సంవత్సరాలుగా మూత్రంలో షుగర్ పోతూఉంది. మాత్రలు వాడగా షుగర్ పర్సెంటేజ్ తగ్గింది. చాలా నీరసం వస్తున్నది. పంచదారనీళ్ళు తాగినా తగ్గటల్లేదు. ఆకలి హెచ్చుగా ఉంటుంది. మామూలుగా బియ్యపు అన్నం మాత్రం తింటున్నాను. యింకా ఏదైనా ఆహారం మార్చవలసి ఉంటుందా ?

★ డయాబెటిస్ ఉన్నవారికి నీరసం, షుగర్ మొదలయినవి రెండు విధాలుగా రావటానికి అవకాశం ఉన్నది. రక్తంలో గ్లూకోజ్ ప్రమాణం ఎక్కువైనా, తక్కువైనా ఇలా జరిగే అవకాశం ఉంటుంది. ఇటువంటి లక్షణం ఉన్నవారు తరుచూ బ్లడ్ షుగర్ పరీక్ష చేయించుకోవటం అవసరం. అలాగే మీ అంతట మీరే మూత్ర పరీక్ష చేయటం నేర్చుకొని షుగర్ ఎక్కువ–తక్కువలను బట్టి మాత్రల ప్రమాణాన్ని వైద్యుల సలహా ననుసరించి నిర్ణయించుకోవలసి ఉంటుంది. ఆహారం కొద్దిగా తగ్గించి, కూరలు ఎక్కువగా తీసుకొంటే మంచిదని ప్రస్తుత అంచనా.

### ఆర్. టి బి. – రాజమండ్రి

గుండెనెప్పి వున్నవారు వక్కపొడి తినకూడదు అంటారు. గుండెనెప్పికి, వక్కపొడికి వున్న సంబంధము ఏమిటి ? వక్కపొడి తింటే గుండె నెప్పి అధికమవుతుందని అంటారు. ఎందువలన?

★ వక్కలలో ఒక విధమైన నూనె పదార్థం ఉండటంవల్లగాని, తద్వారా కొలెస్ట్రాల్ అధికం అయ్యే ప్రమాదం ఉండటంవల్లగాని అటువంటి అభిప్రాయం కలిగి ఉండవచ్చును. ఈ విషయాలన్నీ శాస్త్రీయంగా నిరూపింపబడలేదనే చెప్పవలసి ఉంది.

### డి. పి. – నెల్లూరు

పండ్లపొడి కొందరు తింటూ ఉంటారు. దీనివల్ల ఏమన్నా జబ్బులు కాని రోగాలుగాని వస్తాయా ? పేగులు దెబ్బ తింటాయా ?

★ ఇటువంటి తత్వాన్ని "పైకా" అని అంటారు. ఇది ఒక మానసిక రుగ్మతను సూచిస్తుంది. దీనివల్ల ఆకలి లేమి, విరేచనాలు రాగల అవకాశం ఉన్నా చాలామందికి ఏ విధమైన రోగ లక్షణాలు కనబడవు. పేగులు దెబ్బతినే అవకాశం పెద్దగా లేదనే చెప్పాలి

**— డా. కె. వెంకటేశ్వరరావు.**

అవి విఫలమయితే తట్టుకొనే ధైర్యము మనదేశానికి ఉందా ? కాని అదే విదేశాలు కేవలము ప్రయోగాలు, నూతన విజ్ఞాన విశేషాలు కనుగొనుటకే కొన్ని కోట్ల రూపాయలు ఖర్చు పెడుతున్నవి. అందువలన విజ్ఞాన తృష్ణ కలిగిన ఈ మేధావి వర్గంలో చాలా మంది విదేశ నివాసం కోరుకుంటున్నారు. అలాంటి విదేశ పరిస్థితులు మనదేశంలో రావాలంటే కొన్ని దశాబ్దాలు పడుతుంది. అప్పటివరకు వీరు ఏమి చేయాలి ? డబ్బు కూడా ప్రధానపాత్ర నిర్వహిస్తుంది. సాధారణంగా ఇలాంటి ఉన్నత చదువులు చదివిన వ్యక్తి తనకు సంఘంలో పలుకుబడి, హోదా కావాలనుకొంటాడు కాని మామూలు ఉద్యోగాలతో, చాలీచాలని జీవితాలతో సామాన్య మానవునిలాగా బ్రతకలేడు. అలాంటి పరిస్థితులలో మేధావుల కొరత ఉన్న కొన్ని విదేశాలు అధిక జీతాలతో ఆహ్వానిస్తుంటే వెళ్లకుండా ఏ మేధావి ఆగగలడు ?

విదేశాలకి వెళ్లి కొంతకాలం తర్వాత తిరిగి రావచ్చు కదా అంటారు కొంతమంది. కాని ధన, విజ్ఞాన సంపాదనకు అంతు ఎక్కడ ? నా దేశం అనే సంకుచిత మనస్తత్వం కాక నా ప్రపంచం అనే విశాలభావము ప్రజలలో అలవడాలి.

**— వి. మోహన్ కుమార్**

( 4/4 బి. టెక్ సివిల్ )

## నిరుద్యోగ సమస్య

భారతదేశంలో మేధావుల వలసకు ముఖ్య కారణం నిరుద్యోగ సమస్య. ఈ నిరుద్యోగ సమస్య విలయ తాండవం చేస్తుంటే, జరుగుబాటుకే కష్టంగా ఉన్న కుటుంబాల నుండి కష్టపడి తమ మేధాశక్తిని పెంపొందించుకొనేందుకు వేనకువేలు ఖర్చుచేసి మేధావులు అయిన మన సోదరులకు, కనీసం తమ తిండికైనా సంపాదించిపెట్టే పాటి చిన్న ఉద్యోగమైనా కనుచూపుమేరలో కానరానప్పుడు, ఆ అవకాశమున్న మరే దేశానికో వలస పోవడం తప్ప మరే మార్గముంది కనుక "భారత మాతా" అనుకుంటూ ఆమె గడ్డలోనే జీవించగలరు ?

భారతదేశం పేద దేశం — ఇక్కడి విజ్ఞానం, పాశ్చాత్య విజ్ఞాన ప్రభంజనపు వేగాన్ని సంతరించుకోలేదు. అందుకే ఇక్కడ ఆధునిక పరికరాలకు విజ్ఞాన విశ్లేషణారీతులకు కొరత ఉంది. అందుకే జ్ఞాన తృష్ణ గల మేధావి తన మేధస్సు నిజంగా వృద్ధి చెందాలంటే అవసరమైన ఆధునిక పరికరాలను తన కందించగల దేశానికి వెళ్ళడానికి సుముఖుడౌతాడు.

నిజమైన మేధస్సును గుర్తించలేని విద్యావిధానం మనది. మానవులలోనే అత్యున్నత మేధావిగా గణించతగ్గ శ్రీనివాస రామానుజన్ అప్పటి ఇంటరు పరీక్షలో రెండుసార్లు తప్పాడట ! ఆంగ్లేయులు ఏర్పాటు చేసిన గుమాస్తాల కార్ఖానాలాంటి ఆ విద్యావిధానాన్ని శిరసావహించి అనుసరిస్తున్న భారత విద్యావిధానం గురించి వేరే ప్రసంగం అనవసరం.

భారత భూమిపై ప్రతి విషయం "రాజకీయ విష కలుషితం". చిన్న బంట్రోతు పనినుండి, గవర్నర్ పదవి వరకు ఏది కావాలన్నా రాజకీయమే ! క్రొత్త క్రొత్త ప్రయోగాలను ధైర్యంతో చేపడదామన్నా అవి విఫలమైతే తన గతి ఏమౌతుందా అని ఆలోచించవలసివస్తుంది భారత శాస్త్రజ్ఞుడికి అందుకే భారతదేశపు పరిధిలో మేధావులు వలస పోవడం పూర్తిగా సమంజసం

**— పి. బి. ఆనంద్**

(మూడవ సంవత్సరం) ★

### వి. మోహన్ కుమార్

తీరికగా ఉన్నప్పుడు వ్యాసాలు, కథలు, వ్రాయడం అలవాటు. ఎక్కువగా సినిమాలు చూడటం, నవలలు కథలు చదవటం హాబీలు నేటి యువతరం రచయితలలో యండమూరి వీరేంద్రనాథ్ అంటే ఎక్కువ ఇష్టం.



### పి. బి. ఆనంద్

అన్ని రకాల ఆటలు ఆడడం, గొప్ప వాళ్లందరి పుస్తకాలు చదవడం నాకున్న అలవాట్లు. డిబేటింగ్, వ్యాసరచనలు నా వ్యక్తిత్వాన్ని పెంచే లక్షణాలుగా భావిస్తాను. నన్నయ నుంచి, మొన్నటి మొక్కపాటి ఈనాటి ముళ్ళపూడి అందరూ నా అభిమాన రచయితలే. స్వామి వివేకానంద నా ఆదర్శమూర్తి.



# ది జడ్జిమెంట్

తిరునగరి
వెంకట నారాయణ మూర్తి



సుందరరామయ్యగారు రిటైరైయింతర్వాత ఆధ్యాత్మిక ధోరణిలో పడిపోయారు. తెల్లవారుఝామునే లేవటం. కాలకృత్యాలు తీర్చుకుని మార్నింగ్ వాక్‌కు వెళ్లడం ఏడయ్యేసరికి యింటి కొచ్చి కాఫీ త్రాగి మళ్లీ అలా బయల్దేరి రామాలయానికి వెళ్లి కాసేపు కూర్చుని పదిగంటల కల్లా యిల్లుజేరి పేపర్ మొదటి పేజీనుంచీ చివరి పేజీవరకూ చదివేసే సరికి ఒంటిగంటవుతుంది. అంతలో కోడలు భోజనానికి పిలుస్తుంది. ఆ యింటిలో కూడా ఆయన్ను జడ్జిగానే చూస్తారు రిటైరైనా అంత మర్యాదతోటి కొడుకులూ కూతుళ్లూనూ. అలాగే కోడళ్లు కూడా మామ గారంటే భయంగా వుంటారు. ఆయనదంతటి గంభీరమైన విగ్రహం. ఆ కంఠంలో గంభీరత ఎటు వంటి వాళ్లనైనా కట్టి నిలబెడుతుంది.

ఆ రోజు ఆదివారం ఉదయం పదిగంటలౌతుంది.

'నమస్కారమండీ' అన్నమాటతో పేపర్‌లోంచి తల పైకెత్తారు సుందరరామయ్యగారు.

"నమస్కారం; ఎవరండీ మీరూ..."అన్నారు.

"నేను ప్రక్కవీధిలో వుంటున్నానండీ, నాపేరు రాఘవరావు" అన్నారు ఆ వచ్చినాయన.

"ఏవోయ్ ఓ కుర్చీపంపు" అన్న కేక వింటూనే తెచ్చివేసింది శ్రీమతి శాంతమ్మగారు. "కూర్చోండి ముందు" అన్నారు.

ఆయన కూర్చున్నాక.

"యిప్పుడు చెప్పండి ఏం పనిమీదవచ్చారు."

"నేను ప్రక్కవీధిలో వుంటున్నానని చెప్పాను కదండీ, నేనొక స్కూల్ టీచర్‌గా పనిచేస్తున్నాను. టీచర్‌నేగానీ టీచర్‌గా నావిధి పిల్లలను క్రమశిక్షణలో వుంచడమే అయినా నా పిల్లల విషయంలో ఆ క్రమశిక్షణ పాటించలేకపోయానండీ. మా పెద్దమ్మాయి సుశీల తల్లిలేని బిడ్డ. మీ పెద్దమనుమడు రాజేష్ చదువుతున్న కాలేజీలోనే చదువుతోంది బి. ఏ. మొదటి సంవత్సరం."

'ఆహాం... మావాడేమైనా ఏడ్పిస్తున్నాడా మీ అమ్మాయిని' అనుమానంగా అడిగారు.

'లేదండీ అలా అయితే ఏదో మందలించితే సరిపోయేది. మీ మనుమడుగారుకూడా అదే కాలేజీలో బికాం ఫైనల్ చదువుతున్నారు కదండీ. ఎలాగో మా అమ్మాయి మీ అబ్బాయి ప్రేమలో పడ్డారు అంతటితో ఆగక తొందరపడ్డారు. ఆడపిల్లకదా మా అమ్మాయిదికూడా తప్పే నేను కాదనను. నేను ఆడపిల్ల తండ్రిగా మీ అబ్బాయి రఘువీర్‌గారి భార్య శిలాగార్ని ఎంతగా అర్థించినా నా కూతురికి న్యాయం చేయడానికి ఒప్పుకోలేదు. అందుకే తమరు జడ్జిగా ఎందరికో న్యాయం జేసివుంటారు మా అమ్మాయి బ్రతుకుకు న్యాయం జేయాలి.

ఆడపిల్ల తండ్రిగా మీ కాళ్లు పట్టుకొంటున్నాను... మీరు ఎన్నో కుటుంబాలు బజార్న పడకుండా నిలబెట్టివుంటారు. నా బిడ్డ బ్రతుకు బండలుకాకుండా చూడండి. యిపుడు మా అమ్మాయి మామూలు మనిషికూడా కాదు. మీరు న్యాయం చెయ్యలేకపోతే అమ్మాయికింత విషంపెట్టి నేను యింత తీసుకుని ప్రాణాలు తీసుకుంటాం. ఆ తర్వాత మీ దయ ఎలా వుంటుందో అలా నిర్ణయించండి...' సుందరరామయ్యగారి చేతులు పట్టుకుని అంటుంటే ఆయన కళ్లంట నీళ్లు కారిపోతున్నాయి.

సుందరరామయ్యగారి హృదయం ఆర్ద్రమయింది. ఆ తండ్రి ఆవేదనకు, ఒక ప్రక్క మనవడు చేసిన దౌర్భాగ్యపు పనికి గుండె భగ్గుమంటోందికూడా.

"మీరేం కగారుపడకండి రాఘవరావుగారూ, మావాడు యిలాటి పని జేసినందుకు నాకూ తలవంపులుగానే వుంది. మీ అమ్మాయి ఏ అఘాయిత్యానికీ తలపెట్టకుండా చూడండి. మీరు మళ్లీ వచ్చే బుధవారం కన్పించండి" అన్నారు.

"వెళ్లొస్తాను సార్ నమస్కారం" అంటూ చేతులెత్తి నమస్కరించి వెళ్లిపోయాడు.

* * *

సుందరామయ్యగారు ఆ విషయాన్ని సీరియస్‌గానే తీసుకున్నారు. శాంతమ్మగారితో ఆ రోజు రాత్రి ఈ మాట చెప్పారు. ఆమె ఎంత మాత్రం మనవాడిదే తప్పు అంటే ఒప్పుకోలేదు. ఆ పిల్లే మనవాడి వెంటపడి వుంటుంది. మీరెప్పుడైనా చూశారా మనవాడలా ప్రవర్తించడం? మీరేదో ఆ అమ్మాయిని సమర్థించేలా వున్నారు, కానీ ఏవండోయ్

# తరువు దాగివున్నది

డా॥ సి. నారాయణరెడ్డి

తరువు దాగివున్నది ప్రతి చిగురులోన
పరువు దాగివున్నది ప్రతి కదురులోన
స్వరహృదయం తెలుసుకుని మలచుకుంటె
మురళి దాగివున్నది ప్రతి వెదురులోన.

పాట మూల్గుతున్నది ప్రతి పదంలోన.
మంచి మూల్గుతున్నది ప్రతి మతంలోన.
సాగరేపే కాలంతో విసుగుపుట్టి
ప్రగతి మూల్గుతున్నది ప్రతి కణంలోన.

జడ్జిగారూ, ఆ అమ్మాయిని నా మనవడికి కట్టబెట్టాలనుకుంటున్నారేమో'' అంటూ మనవడి తరఫున వకాల్తా పుచ్చుకుంది.

''రేపు బుధవారం రాఘవరావును రమ్మన్నాను. ఆ రోజు మాట్లాడదాం. ఈలోపు నీ మనవడితో కూడా మాట్లాడు ఏమంటాడో'' అనేసి ఆ విషయం అంతటితో వదిలేశారు.

* * *

బుధవారం పది గంటలకల్లా రాఘవరావు హాజరైనారు.

జడ్జిగారు యింకా హాల్లోకి రాలేదు. శాంతమ్మగారే కుర్చీ చూపించి కూర్చోమంది. అంతలో సుందరరామయ్యగారు హాల్లోకి వచ్చారు.

రాఘవరావు లేచి నమస్కరించి కూర్చున్నారు. శాంతమ్మగారు గుర్రుగా చూసింది భర్తవంక.

''రాజేష్‌ను రమ్మనండి'' అన్నాడు సుందర రామయ్యగారు గంభీరంగా.

రాజేష్ వచ్చాడు. వెనుకే పెద్దకొడుకు రఘువీర్, కోడలు షీలా కూడా లోపలకు వచ్చి ఒక్కప్రక్క సోఫాలో కూచున్నారు.

''ఏమ్మా మీరేమంటారు. మీ అబ్బాయి తప్పు చేశాడని అంటున్నారు రాఘవరావుగారు. కుర్రాడి తల్లిగా తండ్రిగా మీ మాట చెప్పండి'' అని అడిగారు సుందరరామయ్యగారు కొడుకు, కోడల్ని.

కోడలు లేచి నిలబడి చెప్పడం ప్రారంభించింది. ''ఇదంతా రాఘవరావుగారు చేసిన ప్లాన్ మామగారూ. మనం హైక్లాస్ ఫామ్లీవాళ్లం. ఎలాగైనా తన కూతుర్ని మన కుటుంబంలో పడేస్తే అమ్మాయి సుఖపడుతుందని ఆయన ఎత్తువేశాడు. అంతేకానీ నా కొడుకుకు ఈ విషయంలో ఏ మాత్రం సంబంధం లేదు. మేం ఈ విషయంలో ఏమీ చెప్పదలుచుకో లేదు కూడా'' అనేసింది.

రాఘవరావుగారు పులిదెబ్బ తిన్న లేడిలా వణికి పోయాడు, తనమీద అంతటి అపనింద పడేసరికి.

సుందరరామయ్యగారు కోడలు చెప్పింది విని 'నువ్వు చెప్పిందేమంత సబబుగా లేదమ్మా! మన కంటే ధనవంతులు గొప్పవాళ్లు ఊళ్లో ఎందరో వుండగా మనమే ఎందుకు కన్పించాలి రాఘవరావు గార్కి? నువ్వేమంటావురా' అంటూ కొడుకును అడిగారు.

కొడుకు రఘువీర్‌కు తండ్రి మాటంటే ఎంతో గౌరవం. లేచి నిలబడి 'నేను చెప్పేందేంలేదు డాడీ మీ మనవడినే అడగండి' అని కూర్చుండిపోయాడు.

సుందరరామయ్యగారు రాజేష్ వంక చూశారు.

''ఏం నాన్నా చెప్పు, నువ్వు తప్పు చేశావు అంటున్నారు నీవేమంటావు ఏమైనా చెప్పుకోదలిస్తే చెప్పుచ్చు'' అన్నారు.

రాజేష్ లేచి నిలబడ్డాడు. కాని నోరెత్తలేదు. తల దించుకుని నిలబడ్డాడు.

''ఏంబాబూ మాట్లాడవేం? నువ్ చెప్పదలచు కున్నది ఏమీ లేదా'' అన్నారు.

''పిచ్చివాయన వాడేం చెప్తాడండి. మీరు చిన్న పిల్లవాడిని అలా నిలదీసి అడిగేస్తే చెయ్యని తప్పు ఒప్పుకుంటాడనుకుంటున్నారేమో. నేను మాత్రం సహించేదిలేదు. నా మనవడికి టైం యివ్వండి ఆలో చించుకోడానికి. రేపు ఆదివారం రాజేష్ సమాధానం చెప్తాడు. నాలుగురోజుల వ్యవధి యివ్వండి'' అని ఆమె అడగటంతో ఆ రోజుకు ముగించారు సుందర రామయ్యగారు. రాఘవరావుగార్ని ఆదివారం అమ్మాయితో కూడా రమ్మని చెప్పి.

* * *

శాంతమ్మగారు ఆ రోజు రాత్రికి రాజేష్‌ను పిలిచింది తన గదిలోకి, సుందరరామయ్యగారు యింట్లో లేకపోవడం చూసి.

''ఏం రాజేష్ నువ్వు ఎందుకు మాట్లాడ కుండా వుండిపోయావు నేనున్నాకదురా వెర్రినాగన్నా! వాళ్లేదో ఆ అమ్మాయిని నీకు ఎలాగైనా కట్టబెట్టెయ్యాలని చూస్తున్నట్లుంది. నువ్వేం భయపడకు. ఎలాగైనా తప్పించేసే పూచీనాది. నీ గ్రాడ్యుయేషన్ అవగానే కలెక్టర్‌గారమ్మాయికిచ్చి పెళ్ళి చేసేస్తాం, ఆయనే ఉద్యోగంకూడా యిప్పించు కుంటాం అంటున్నారు కాబట్టి. మన స్టేటస్‌కు తగిన సంబంధం కూడా అదయితే. ఏం ఖర్మ పట్టింది యీ స్కూలు మాస్టారిపిల్లను జేస్కోను.''

'నువ్వేం మాట్లాడకు నేను నడిపిస్తానుగా' అంటుండగా కోడలు వచ్చింది లోపలకు.

'చూడండి అత్తయ్యగారూ! మీ అబ్బాయి కూడా మామగార్ని సపోర్ట్ జేస్తున్నారు. ఎలాగైనా ఈ గొడవ నుంచి నా కొడుకునూ మమ్మల్నీ తప్పించే బాధ్యత మీదే ఏం చేస్తారోనత్తయ్యా' అంటూ వలవలా ఏడ్చేసింది.

'ఛీ పూర్కోమ్మా నీవేం దిగులు పడకు నేనున్నాగా' అంటూ శాంతమ్మగారు ఓదార్చింది.

''ఏమోనత్తయ్యా నాకైతే భయంగానే వుంది. మీదే భారం'' అంటూ కొడుకును తీసుకునివెళ్లింది.

* * *

ఆదివారం పది కాకుండానే రాఘవరావుగారు కూతురు శాంతిని తీస్కొని వచ్చారు. పేపరు చదువు కొంటున్న సుందరరామయ్యగారు తలెత్తి చూసి వాళ్లను కూర్చోమని చెప్పారు. ఒక్కసారి శాంతిని పరికించి చూశారు.

చక్కటి ఛాయతో చూడ చక్కని రూపం శాంతిది. లంగా ఓణీ వేస్కొనివుంది. ముఖంలో ఎంతో కళ వుంది. కులం తక్కువైనా రూపం తక్కువ కాదు, గుణం తక్కువకాదు. లేకపోతే యింకో అమ్మాయి అయితే ఈ పాటికి కూర్చోమనగానే కూర్చుని వుండేది శాంతి మాత్రం తండ్రి వెనుక నిలబడే వుంది తలవంచుకొని.

రాజేష్ అని సుందరరామయ్యగారు పిలవడంతో రాజేష్, వెనుకనే తల్లి. ఆ వెనకే శాంతమ్మగారు వచ్చారు హాల్లోకి.

తండ్రి చాటున నిలబడివున్న శాంతిని చూడ గానే రాజేష్ గుండె గొంతులో కొట్టుకుంది.

శాంతికి అక్కడ నిలబడటం ఎంతో కంటక ప్రాయంగా వుంది. తను ప్రేమించింది యింత స్వతంత్రత లేనివాడినా? అని ఎంతో మథన పడుతోంది ఆమె మనసు.

శాంతమ్మగారికైతే కోపం ఆకాశానికంటింది. రాజేష్ తల్లి షీలా మాత్రం నా కొడుకును వల్లోవేస్కొని చేసేదంతా చేసి ఎంత నంగనాచిలా నిలబడిందో అనుకుంది గుర్రుగా చూచి.

''ఏమ్మా రఘూ లేడా'' అనడిగారు కోడల్ని.

''లేరండీ ప్రొద్దుటే పనుందంటూ వెళ్ళి పోయారు'' నిదానంగా చెప్పింది.

''చెప్పు రాజేష్, నీకు టైం యిమ్మని అడి గింది నీ తరపున నానమ్మ.''

రాజేష్ ఏదో చెప్పాలని నోరు తెరవబోయి శాంతివంక చూశాడొకసారి. శాంతికూడా అదే సమయంలో రాజేష్‌వంక చూసింది ఎక్కడ తనకేమీ తెలియదని చెప్పేస్తాడోనని భయంతో. రాజేష్ కళ్లు దొంగలా చిక్కిపోయాయి. తప్పించుకోలేకపోయాడు. శాంతి కళ్లు ఎంతో బేలగా వున్నాయి. ''దేవుడే అడ్డంవచ్చినా నీకు అన్యాయం చెయ్యను శాంతీ'' అన్న తన మాటలు గుర్తుజేస్తున్నాయి ఆ కళ్లు.

ఆమె కళ్లు వర్షించడానికి సిద్ధంగా వున్నట్లున్నాయి. రాజేష్ కళ్లు దించుకున్నాడు. మాట్లాడ

# ది జడ్జిమెంట్

కుండా వుండిపోయాడు ఏదో నిర్ణయానికి వచ్చిన వాడిలా చర చరా లోపలకు వెళ్ళిపోయాడు.

సుందర్రామయ్యగారు తేరుకుని చూసేంతలో రాజేష్ స్కూటర్ చప్పుడు చేసుకుంటూ వెళ్ళిపోయింది.

తర్వాత షీలా మా అబ్బాయి మీ అమ్మాయితో తిరిగినట్లు ఏదైనా సాక్ష్యం వుందాండీ... అంటూ అడిగింది రాఘవరావుగార్ని...

"లేకేమమ్మా మీ అబ్బాయి అంతరాత్మను అడగండి చెప్తుంది. మీ అబ్బాయి అంతరాత్మ చెప్పేది మీరు నమ్మలేకపోతే మీ అబ్బాయి ఆ మధ్య వెళ్ళి నెల్నాళ్ళున్నపుడు మా అమ్మాయికి వ్రాసిన వుత్తరాలు చూడండి" అంటూ ఓ పది వుత్తరాల కట్ట సుందరరామయ్యగారి చేతిలో వుంచారు రాఘవరావుగారు.

ఒక్కో వుత్తరం పరిశీలనగా చూశారు సుందరరామయ్యగారు. ఆ చేతి వ్రాత రాజేష్‌దేనని చూడగానే తెల్సిపోయింది కాబట్టి చదివిన రెండు ఉత్తరాలు కోడలి చేతికందించారు. ఒక వుత్తరం శాంతమ్మగారి చేతిలో పెట్టారు యిద్దరూ చదివి ఉత్తరాలు చింపేశారు కోపంగా. దొరికిపోయినట్లు.

సుందరరామయ్యగారికి చాలా కోపం వచ్చింది. 'ఏంచేస్తున్నారు, మీకు తలకాయలున్నాయా? ఉూ ఉత్తరాలు చింపేశారు. ఆ పిల్ల బ్రతుకును ఏం చేస్తారు' అంటూ హుంకరించారు. మిగిలిన వుత్తరాలు తన దగ్గరే వుంచుతూ.

తర్వాత "ఏమ్మా నువ్వేదైనా చెప్పదలుచుకున్నావా" అనడిగారు శాంతి వంక చూస్తూ.

శాంతి రెండడుగులు ముందుకేసి సుందరరామయ్యగారి కాళ్ళు చుట్టేసి వెక్కి వెక్కి ఏడ్చి సొమ్మసిల్లి పోయింది.

రాఘవరావుగారు లేచి కూతుర్ని లేపి చల్లనీళ్ళు చల్లి యింటికి తీసుకువెళ్ళడానికి ఉద్యుక్తులయ్యారు.

మీరు రెండు రోజులాగి కన్పించండి. మీ అమ్మాయితో కూడా రండి. నా నిర్ణయం చెప్తాను అన్నారు.

నమస్కరించి శెలవు తీసుకున్నారు రాఘవరావుగారు, శాంతి.

* * *

ఆ రోజు సాయంత్రం సుందరరామయ్యగారు రాజేష్ రూంలో కూర్చుని ఆ కుర్రాడి పుస్తకాలు తిరగేస్తున్నారు టేబుల్‌పై వున్నవి. వాటిలో శాంతి ఫోటో కూడా వుంది. అది తీసుకుని దగ్గర పెట్టుకున్నారు.

అంతలో వాకిట్లో షూ చప్పుడు అయింది.

రాజేష్ లోపలకు వచ్చాడు.

"ఏంటి తాతయ్యా యిలా వచ్చారు" అన్నాడు.

"కూర్చో రాజేష్, నీతోనే మాట్లాడాలని" అన్నారు.

షూ విప్పుకుంటూ తాతగారి ఎదురుగా కూర్చున్నాడు.

"ఏంటి నాయనా చెప్పు? నీకు ఆ అమ్మాయి తెలియదనే చెప్పదలుచుకున్నావా నువ్వు కూడా. వుదయం వరకూ మీ అమ్మ అలానే వాదించి నీ ఉత్తరాలు ఆ అమ్మాయి తండ్రి యిచ్చాక తలొంచుకుంది. నీ మాటేమిటో అందరిముందు చెప్పడానికి భయపడినా నాతో చెప్పు. ఆ అమ్మాయి తల్లిలేని పిల్ల. నువ్వు కాదంటే మనం రెండు నిండు ప్రాణాల్ని బలితీసుకున్నవాళ్ళమౌతాము రాజేష్. నా సర్వీస్‌లో జడ్జిగా నాకు చేతనైనవరకూ నా చేతిలో వున్న అధికారంతో ఎవరికీ అన్యాయం జరగకుండానే చూశాను. ఈ ఆఖరి రోజుల్లో నీకోసం మీ అమ్మ కోసం మరి అన్యాయానికి పాలుపడుతున్నానేమో బాబూ" అన్నారు.

అప్పటికే తాతగారి గంభీరమైన మాటలకు రాజేష్ కరిగిపోయాడు. మానసికంగా ఎంతో అలసిపోయివున్న రాజేష్, "తాతయ్యా మీరెలా చెప్తే అలా చేస్తాను నేను. నాన్నకూడా యిది తెల్సినదగ్గర్నుంచీ నాతోటి అమ్మతోటి మాట్లాడ్డంలేదు. సరిగా యింట్లోకూడా వుండటంలేదు కూడా మా మొఖాలు చూడాల్సి వస్తుందేమోనని"...

"నాకుతెల్సు బాబూ, వాడు నాకొడుకు. వాడిది నా రక్తం. అందుకే వాడూ బాధపడుతున్నాడు ఎక్కడ మీరు తాకర్సి ఆ అమ్మాయినీ అర్భకతండ్రినీ పొట్టన పెట్టుకుంటారోనని. నువ్వు చిన్న పిల్లాడివి కాదుకదా కొట్టిచెప్పడానికి. నువ్వు మీ అమ్మ కొంగు పట్టుకు తిరుగుతుంటే నువ్వు మీ అమ్మా ఒక్కటే ననుకుంటున్నాడు.

అయితే ఒక్కమాట బాబూ నీకైతే ఆ అమ్మాయిని చేస్కోడానికి ఏం అభ్యంతరంలేదుగా" అని మరోసారి రెట్టించారు.

"లేదు తాతయ్యా నన్నింకా చంపకండి. ప్రేమించినపుడే తెల్సు నాకు అమ్మాయి మన కులం కాదనీ,సామాన్య కుటుంబమనీ. ప్రేమకు అడ్డురానివి పెళ్ళికి అడ్డువస్తాయనుకోలేదు ఆరోజున" అంటూ తాతగారిని చుట్టేసి ఏడ్చేశాడు రాజేష్.

సుందరరామయ్యగారు కాసేపు అలా వుండిపోయారు మనవడి వీపు నిమురుతూ.

"ఏం భయపడకు నేను అంతా సక్రమంగా చేస్తానుగా" అని ధైర్యంచెప్పి బయట కొచ్చేశారు రాజేష్ రూంలోంచీ.

* * *

మరురోజు వుదయం కొడుకును తన గదిలోకి పిల్చారు సుందరరామయ్యగారు. రఘువీర్ మాట్లాడకుండా వచ్చి కూర్చున్నాడు.

రెండో కొడుకు, మూడో కొడుకు చదువులైపోయాక పెళ్ళిళ్ళు చేసుకుని స్టేట్స్‌లో సెటిల్ అయినారు. చివరి అమ్మాయి కూడా ఢిల్లీలో వుంటోంది అల్లుడుగారు అక్కడ యింజనీరుగా చేస్తుండటంతో. ఎవరూ రఘువీర్ అంత చనువుగా తండ్రి గదిలోకి వచ్చేవాళ్ళు కాదు.

"ఏంటి నాన్నగారూ పిల్చారు" అంటూ రఘువీర్ మొదలుపెట్టాడు.

"అదేరా నీ కొడుకు రాజేష్ చేసినదానికి రేపు నా నిర్ణయం చెప్తాను రమ్మన్నానురా వాళ్ళను. నీ అభిప్రాయం కూడా అడుగుదామని" అన్నారు.

"మీకు తెలియదా డాడీ నా అభిప్రాయం. ఈ వెధనను తన్ని తగలేద్దామన్నంత కోపం వచ్చింది

ఆ రోజే. ఆ అమ్మాయికి అన్యాయం జరక్కుండా మీరే నిర్ణయం తీసుకున్నా నాకేమీ అభ్యంతరంలేదు. కానీ షీలా, అమ్మా ఈ విషయంలో కాస్త మొండిగా వున్నారు నాన్నా! దానికేమాత్రం ఇష్టం లేదు. ఎలాగైనా వదిలించుకోవాలన్న ధోరణిలో వుంది దాని పద్ధతి చూస్తుంటే ... '' రాజేష్.

''అమ్మాయి సంగతి నాకొదిలేయి బాబూ! నేను మాట్లాడే చేస్తాగా ఏం చేసినా. నీకేం అభ్యంతరంలేదు అంటే తర్వాత సంగతి నేను చూసుకుంటాను'' అన్నారు సుందరరామయ్య.

''నాకు ఎలాటి అభ్యంతరంలేదు డాడీ. నా కొడుకు మూలంగా ఒక కుటుంబం బజార్న పడుతోందంటే నేను ఎంతో బాధపడుతున్నాను మనవాడు చేసిన పనికి'' బాధపడుతూ రఘువీర్ చెప్పాడు.

''సరే బాబూ నువ్వు నిశ్చింతగా వుండు. పుదయం వాళ్లను రమ్మన్నాను. రేపు ఉదయం నువ్వు కూడా వుండు ఎటూ వెళ్లబోకు'' అని చెప్పాక.

''అలాగే ... వస్తా నాన్నాగారూ'' అంటూ రఘువీర్ లేచాడు కుర్చీలోంచి.

*　　　*　　　*

రఘు ఆఫీస్‌కెళ్లిపోయాక సుందరరామయ్య గారు రఘువాళ్ల గదిలోకి వచ్చారు. షీలా పడుకొని వుంది. ఆ అమ్మాయి చేతిలో నవల వున్నా కళ్ళు మాత్రం ఎక్కడో ఆలోచిస్తున్నాయి. పాపం పిచ్చి పిల్ల ఎంత వర్రీ అవుతోందో అనుకొంటూ కుర్చీ లాక్కుని కూర్చున్నారు.

ఆ చప్పుడుకు చటుక్కున లేచి నిలబడింది మంచం దిగి షీలా.

''మీరా మావగారూ. నేను చూడలేదు'' అంటూ సంజాయిషీ యిచ్చింది.

''ఫర్వాలేదు కూర్చోమ్మా'' అన్నారు గంభీరంగా.

''ఫర్లేదులెండి చెప్పండి'' అంది భయం భయంగానే.

''అదేనమ్మా రేపు ఆ అమ్మాయినీ, వాళ్ల నాన్ననూ రమ్మన్నాను కదా నా నిర్ణయం చెప్పటానికి. ఈలోపు నువ్వేమనుకుంటున్నావో కూడా జడ్జిమెంట్ యివ్వబోయేముందు జడ్జిగా కాక నీ మామగారుగా అడుగుతున్నాను చెప్పు...'' అంటూ ఆగారు.

అంత గంభీరంగా వుండే ఆయన కంఠంలో ఆ సౌమ్యతకు షీలా గుండె కరిగి నోటమాట పెగల్లేదు.

''రేపు నీకు ఆడపిల్లలు పుట్టచ్చు. నీకూతురికే అయితే యిలాటి పరిస్థితివస్తే నువ్వేంచేస్తావు చెప్పమ్మా...'' అన్నారు తనే.

ఎలాగో పెగుల్చుకొని ''నా కూతురి గొంతు పిసికి చంపేస్తాను...'' అని భళ్లున ఏడ్చేసింది అక్కడే కూలబడి చేతులతో మొఖం కప్పుకొని.

''తప్పమ్మా ఊర్కో...ఏడ్వకు. యిపుడేమై పోయిందని. నీ నిర్ణయం రెండు నిండు ప్రాణాల్ని బలి తీసుకోకుండావుండాలనేనమ్మా నా తాపత్రయం కూడా. 'నా కొడుక్కు, నా స్టేటస్‌కు తగ్గట్టు కలెక్టరుగారి అమ్మాయి సంబంధమే చేస్తాను,వాళ్ళు ఛస్తే నాకేం, అంటావా నాకూ అభ్యంతరం లేదు'' అన్నారు గంభీరంగా.

''మీ యిష్టం మామగారూ ఏంచేస్తారో! వాళ్ల మాటెలావున్నా పిచ్చివాడిలా తిరుగుతున్న రాజేష్‌ను చూస్తుంటే నా కడుపు తరుక్కుపోతోంది. ఎలాగో మీరే ఈ సమస్యకు ఒక దారి చూడండి. డబ్బు పోయినా పర్లేదు నాకీపీడ వదిలించేయండి. నా రాజేష్ మాకు దక్కుతాడా అని నాకు అనుమానం వస్తోంది. ఈ పది రోజుల్లో వాడిలో వచ్చిన మార్పు చూస్తుంటే. నా కొడుకును నాకు దక్కించండి మామయ్యా'' అంటూ బావురు మంది షీలా.

''ఏం భయపడకమ్మా నేనున్నానుగా, నామీద వదిలెయ్ అంతా నేను చూసుకుంటాను. అంతా సవ్యంగా జరుగుతుంది. రాజేష్ విషయం నాకొదిలేయి వాడిని మనిషిగా జేసే పూచీ నాది'' అని ధైర్యం చెప్పి తన గదిలోనికి వచ్చేశారు.

శాంతమ్మగారు మంచం మీద పడుకొని ఎక్కడో ఆలోచిస్తోంది.

మెల్లగా మంచం దగ్గరకొచ్చి ''ఏవిటోయ్ అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్'' అన్నారు మంచం మీద తల దగ్గర కూర్చుంటూ.

''ఏవండీ రాజేష్‌ను చూస్తున్నారా'' అన్నారు శాంతమ్మగారు.

''అవును ఏమైంది చెప్పు.''

''వాడు చూశారా యీ గొడవైం తర్వాత ఎలా తయారయ్యాడో? వేళకు తిండంలేదు ఆతిండి కూడా ఏదో మొక్కుబడిగా నాళ్లమ్మ నేను దగ్గర కూర్చుని ఎంతో బలవంతం పెడితేనే రెండుముద్దలు తింటున్నాడు. వాడికళ్లలో చూశారా అసలు కాంతి ఏమైనా వుందేమో. పది మాటల్లో ఒక్కమాటకు సమాధానం చెప్తున్నాడు. చూస్తున్నారా!'' అంది.




''అంతా సవ్యంగానే అవుతుంది. నువ్వేం భయపడకు నీ మాట ఏమిటి చెప్పు ఆ విషయంలో'' సూటిగా అడిగారు.

''చూస్తూ చూస్తూ ఆ పిల్లని నా యింటికి తీసుకు రాలేం కదండీ, డబ్బు యిచ్చో ఏదో చేసి మనం వదిలించుకుందాం ఈ పీడను'' అంది.

*　　　*　　　*

అనుకున్న రోజు రానే వచ్చింది.

రాఘవరావుగారి కోసం చూస్తున్నారు అంతా హాల్లో కూర్చుని.

రిక్షా ఆగింది.

యిద్దరూ రిక్షా దిగి లోపలకు వచ్చారు.

లోపలికొచ్చి సుందరరామయ్యగార్కి నమస్కరించి రాఘవరావుగారు కూర్చున్నారు. శాంతి కూర్చోకుండా తండ్రి వెనుకగా నిలబడింది.

ఆమె కళ్లు వుబ్బి వున్నాయన్నది ఒక్క రాజేష్ మాత్రమే గమనించాడు. తనవంకచూస్తుందేమోనని చూశాడు ఆమె వంక. కానీ కళ్ళెత్తి చూడనే లేదు నేల చూపులు చూస్తూ వుంది. రాజేష్ మనసు మరింత బాధపడింది ఆమె దీనంగా నిలబడివున్న తీరు చూసి. పిల్ల కాదని అడ్డం తిరిగితే రాత్రికే శాంతిని తీస్కొని ఎటైనా పారిపోవడాని నిశ్చయించుకొన్నాడు ఆక్షణంలోనే. అదే తన గుండె కోతకు సరైన ఓదార్పు అనుకుంటూ.

సుందరరామయ్యగారు గొంతు సవరించుకున్నారు, జడ్జిమెంట్ యివ్వడానికి ఒక్కసారి అందరి వంకా చూస్తూ.

రాజేష్, శాంతి గుండెలు ఎంతో వేగంగా కొట్టుకున్నాయి ఏం వినబోతున్నామోనని.

షీలా, శాంతమ్మగారి మనస్సులు మాత్రం భగ్గుమంటున్నాయి, ఈయన ఏం చెయ్యబోతున్నారోనని. ఏ నిర్ణయం తీస్కున్నా ఎదురు చెప్పగల ధైర్యం కట్టుకున్న శాంతమ్మగారికే లేదు కోడలుగా షీలాకు ఎక్కడినుంచి వస్తుంది? ఆయన ఏ నిర్ణయం తీసుకున్నా కట్టుబడి వుండాల్సిందే!

''రాఘవరావుగారూ! మీ అమ్మాయిని యిలా తీసుకురండి'' అన్నారు గంభీరంగా సుందరరామయ్యగారు.

శాంతి దగ్గరకొచ్చాక ఆ అమ్మాయి చెయ్యిని తన చేత్తో పట్టుకొని రాజేష్‌ను పిలిచి రాజేష్ చేతిలో పెట్టారు.

అనుకోని తీర్పుకు శాంతి తల్లడిల్లిపోయింది. వెంటనే సుందరరామయ్యగారి పాదాలను ముట్టుకుని నమస్కారం చేసింది. రాజేష్‌కూడా తాతగారి పాదాలకు నమస్కరించాడు.

తేటపడ్డ మనసుతో తల్లితండ్రులవంక నడిచాడు రాజేష్ శాంతి చేయి పుచ్చుకుని.

రాఘవరావుగారు సుందరరామయ్యగారి రెండు చేతులూ పుచ్చుకొని రెండు కళ్లకూ అద్దుకుంటుంటే, జడ్జిగా తను ఈ కేసుకుకూడా మంచి జడ్జిమెంట్ యిచ్చానన్న ఆనందంతో తృప్తిగా ఆయన్ను వారించారు. 

సీరియల్

# వక్కలంక పద్మావతి

(గత సంచిక తరువాయి)

సినిమా హాల్లో సురేంద్రను నొప్పించినందుకు అతను ఏమైనా బాధపడ్డాడేమోనని మంజుల చాలా సేపు బాధపడింది. మర్నాడు అతను ఆఫీసు నుంచి రాగానే టిఫిన్, టీ కెటిల్‌లో పోసుకుని పైకి వెళ్ళింది.

"హలో మంజూ! గుడ్ ఈవినింగ్! అదేమిటి ఇంత శ్రమపడుతున్నారు తమరు ?"

"ఆఫీసు నుంచి తమరు అలసిపోయి వచ్చారని !" అంటూ టిఫిన్, కెటిల్ టీపాయ్ మీద పెట్టి చైర్‌లో కూర్చుంది.

మొహం కడుక్కుని వచ్చి "థాంక్స్ మంజూ!" అంటూ టిఫిన్ చేతిలోకి తీసుకున్నాడు.

"మంజూ ! రాత్రి పిక్చర్ ఎలా వుంది ?"

"బానేవుంది" — హాల్లో తమని గమనించే అడుగుతున్నాడని గ్రహించింది మంజుల.

"ఏమిటి బావుంది ... అసలు పిక్చరు చూశారా మీరిద్దరూ."

"నన్ను ఏడిపించటం తప్ప నీకు వేరే పనేం లేదన్నమాట."

సురేంద్ర చిన్నగా నవ్వి... రెండు కప్పుల్లోకి టీ వంచుతూ అన్నాడు.

"ఇంకెన్నాళ్ళులే మంజూ ... మరో రెండు మూడు నెలల్లో నువ్వు వినోద్‌తో మలేషియా వెళ్ళిపోతున్నావు. నాకు ఇక ఆత్మీయులెవరున్నారు చెప్పు..." అతని గొంతులో బాధ ధ్వనించింది.

"గాయత్రి వుందిగా."

ఆశ్చర్యంతో చివాలున తలెత్తి చూశాడు మంజుల వేపు. అతని గుండె వేగంగా కొట్టుకుంటూంది. అది ఆనందమో మరేస్థితో అతనికే అర్థం కావటంలేదు. ఏదో అర్థం కాని అనుభూతి కలిగింది. చాలా సేపటి వరకూ అతను ఆ స్థితి నుంచి తేరుకోలేక పోయాడు.

"సురేన్ ! ఏమిటలా వుండిపోయావు."

"మంజూ! నన్ను అపార్థం చేసుకున్నావా!"

"ఛ! లేదు సురేన్. నీ మనసు నాకు తెలీదూ ! రాత్రి సినిమా హాల్లో నీ మనసు నొప్పించే విధంగా మాట్లాడినందుకు ఏమైనా అనుకున్నావా ! వినోద్ నాకు దూరమవుతాడేమోననే బాధలో నిన్నలా అన్నాను. నన్ను మనస్ఫూర్తిగా క్షమించు."

ఆమె కంఠంలో పశ్చాత్తాపం ధ్వనించింది. అన్నీ విన్నాడు సురేంద్ర.

"నిజంగా నేను అలాటి మూర్ఖుడిలా కనిపించానా నీకు ! నీ జీవితానికి, నీ సంతోషానికి నేనెలా అడ్డురాగలను ? అంకుల్‌తో చెప్పి నీ మారేజ్ సెటిల్ చేసే బాధ్యత నేనే స్వీకరిస్తాను. నువ్వు ఆనందంగా వినోద్‌తో జీవితాన్ని పంచుకుందువు గాని!" ఆమెకు ధైర్యం చెపుతున్నట్టు అన్నాడు.

సంతృప్తి, కృతజ్ఞత నిండిన చిరునవ్వు ఆమె పెదవుల మీద విరిసింది. మరుక్షణంలో ఆమె కళ్ళు దిగులుగా మారాయి.

"కానీ... గాయత్రికి, నీకూ మారేజ్ అవుతుందనే భరోసా స్నేహితురాలిగా నేనివ్వలేక పోతున్నాను సురేన్..." బాధ పడుతూ అంది.

అతని మనసు వ్యాకులమైంది. లోపల్నుంచి వేదన పొంగుకొచ్చింది. "సురేన్" అంటూ ఏదో చెప్పబోయింది మంజుల.

---

**జరిగిన కథ — 2 :** సురేంద్ర ఉద్యోగ నిమిత్తమై తన తండ్రికి మిత్రుడైన విశ్వనాథంగారింటికి వస్తాడు. మంజుల విశ్వనాథంగారి కుమార్తె. విశ్వనాథంగారి కుటుంబంతో కచేరికి వెళ్ళగా అక్కడ గాయత్రి పరిచయం అవుతుంది. మంజులతో గాయత్రి ఇంటికి బయల్దేరుతాడు సురేంద్ర. అతనికి గాయత్రి గురించి చెపుతుంది మంజుల. గాయత్రి అందం చూసి ముగ్ధుడవుతాడు సురేంద్ర. ఆమెను ప్రేమిస్తాడు. మంజుల వినోద్‌ను తను ప్రేమిస్తున్నట్టు, పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నట్లు సురేంద్రతో చెపుతుంది. వినోద్‌ను సురేంద్రకు పరిచయం చేస్తుంది.

---

"మంజూ! నేను గాయత్రిని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. కేవలం ఆమె సౌందర్యం కోసం నేను పాకులాడటంలేదు. మొదటి చూపులోనే ఆమె నా జీవితానికి ప్రతిబింబం అన్పించింది. ఆ క్షణం నించీ గాయత్రి నా హృదయంలో నిండిపోయింది. ఆమె కష్టాల్ని, ఆమె ప్రేమని, నవ్వుని అనురాగాన్ని నావిగా చేసుకుని నా మనసును ఆమెకు తెలియజేయాలని ఆతృత ... కాని ఆమె ఏ విధంగా అర్థం చేసుకుంటుందోనని చెప్పలేకపోతున్నాను.

ఆమె మాట, ఆమె సౌందర్యం ఆమె మనసును చదివిన నేను ఒక సామాన్యురాలిని కోరినట్లుగా కోరటంలేదు. ఆమెలోని ప్రత్యేకమైన ఆధిక్యతలకు విలువనిచ్చి, ఆమెను సంతృప్తి పరచాలనుంది. ఆమె జీవితం నాతోనే ముడిపడి వుందని, నా సర్వప్రపంచం ఆమేనని గాఢంగా కోరుకుంటున్నాను. నా మనసును నా ప్రేమను భగ్నంచేస్తే ... నేను బ్రతకలేను. పిచ్చివాడిలా బ్రతుకు చీకటిగా గడుపుతానేమోనని భయం వేస్తుంది. నేనా నరకాన్ని భరించలేను. అలాంటి దౌర్భాగ్యాన్ని, గాయత్రి నాకు ప్రసాదించదు మంజూ! నాకానమ్మకం వుంది. ఎందుకో నాకలాటి నమ్మకం ఏర్పడింది."

అతని గొంతులో మంచి బాధలోనూ, ఉద్వేగంతోనూ బరువుగా వెలువడ్డాయి ఆ మాటలు. మంజుల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఇంత మంచి మనసున్నవాడివి. నిన్ను పొందగల్గితే గాయత్రి ఎంతో అదృష్టవంతురాలు. గాయత్రికి ఏదోవిధంగా ధైర్యాన్ని నచ్చచెప్పి నేను ఒప్పిస్తాను సురేన్."

రెండు నిమిషాలు ఆలోచించి అన్నాడు "ఒద్దులే మంజూ! ఆ విధంగా ప్రేమను పొందలేం ! ప్రేమానుభవాన్ని సీరియస్‌గా తీసుకుని అదే జీవితానికి దీపంలా భావించే మనసుండాలి. అందుకే ముందు ఆమె మనసులో ఏముందో తెలుసుకుని నేనే స్వయంగా చెప్తాను. ఆ క్షణంలో ఆమె మొహంలో వెలిగే కాంతుల్ని చూసి నేను మురిసిపోవాలి !"

చెప్పటం ఆపేసి, విభ్రాంతితో గుమ్మంకేసి చూస్తుండిపోయాడు సురేంద్ర.

"మే ఐ కమిన్" నవ్వుతూ అడిగింది గాయత్రి.

ఆమె అక్కడికివచ్చి చాలాసేపయింది సురేంద్ర మాటలన్నీ జాగ్రత్తగా విన్నది గాయత్రి.

"రా గాయత్రీ! మంచి సమయానికే వచ్చావు. సురేంద్ర గొప్ప చిక్కుల్లో పడ్డాడు. నువ్వు కాస్త హెల్ప్ చేద్దువుగాని." అంటూ గాయత్రిని ఆహ్వానించింది మంజుల.

"మంజులా" కంగారుగా అన్నాడు సురేంద్ర. అతనే లేచి ఆమెను ఆహ్వానించాడు.

"ఏమిటండీ ! ఏం చిక్కుల్లో పడ్డారూ?"

వచ్చి కూర్చుని ఆశ్చర్యంగా కాస్త సీరియస్‌గా అడిగింది.

"సురేంద్ర ఒక అందాల బొమ్మని, సుగుణాలరాశిని, గాఢంగా ప్రేమించానంటున్నాడు. ఆ విషయం ఆ అమ్మాయికి చెప్పాలంటే ఆమెకి తనంటే ఎలాటి అభిప్రాయం వుందోనని తికమకపడుతున్నాడు. తీరా చెప్పాంతర్వాత ఆమె కాదంటే తను పిచ్చివాడినైపోతానంటున్నాడు."

మంజుల మాటలకి పగలబడి నవ్వింది గాయత్రి. సురేంద్ర, మంజుల తెల్లబోయి చూశారు. ఆమె ఎందుకలా నవ్వుతోందో ఇద్దరికీ అర్థంకాలేదు.

"ఎందుకలా నవ్వుతున్నావు గాయత్రీ" మంజుల అడిగింది.

"ఏమీలేదు మంజులా! యీ మగాళ్ళు ప్రేమగురించి చెప్పే కబుర్లు వింటుంటే చచ్చే నవ్వొస్తుంది. ఇప్పుడిలానే కబుర్లు చెప్తారు. ఆ అందాలబొమ్మ, సుగుణాలరాశి పెళ్ళిచేసుకున్న తర్వాత ఇద్దరిమధ్యా ఏవైనా చిక్కు సమస్యలు వచ్చినపుడు వాటిని పరిష్కరించుకునే తెలివిలేక, అవగాహనలేక అప్పటివరకూ మంచి 'టెన్షన్'లోవున్న ప్రేమకాస్తా మసకబారుతుంది. ప్రేమించి చేసుకున్నందుకు అయినవాళ్ళ అండలేక అటు సంఘం నించి, ఇటు మిత్రుల నించి అవమానాలు, అపనిందలు పడి ఒకేచోట పరాయి మనుషుల్లా, మమతలేని బతుకు గడుపుతారు."

ఆమె మాటలకు సున్నితమైన అతని మనస్సు దెబ్బతింది. యీమెకు తన హృదయాన్ని ఎలా తెలియపరచేది? అతని హృదయంలో ఆక్రోశం...

మంజుల ఉరిమినట్టు చూసింది గాయత్రిని. ఆమె నవ్వింది.

"ఆఫ్‌కోర్స్! అలాటి మగవాళ్ళు వుంటే వుండొచ్చుగాక. కానీ మా సురేంద్ర అలాటివాడు కాదు. నువ్వు ఉత్త మొద్దువి. అతని మనసు నీకీ జన్మకి అర్థం కాదు. అతను ఊఁ అంటే వచ్చి గొప్ప గొప్ప అమ్మాయిలు క్యూలో అతని ముందు వాలతారు."

"ఆహా! అదేనన్నమాట మీ ఇంటి ముందు రేషన్ షాపు దగ్గరున్నట్టు అమ్మాయిలు క్యూలో నిలబడ్తారు" హాస్యంగా అంది గాయత్రి.

"సురేంద్ర ఊఁ అనలేదుగా. ఆ క్యూ అందుకే వుండదు. ఉండు నే వెళ్ళి తెలుసుకుంటాను" అంటూ లేవబోయింది మంజుల.

"వద్దులే కూర్చోవే" గాయత్రి కంగారుగా అంది.

"మంజూ! గాయత్రి అన్నదాన్లోనూ నిజం లేకపోలేదు. నిత్యజీవితంలో మనకి ఎక్కువగా అలాటివాళ్ళే తటస్థ పడుతూ వుంటారు. అందువల్లే గాయత్రి నమ్మానా









మనః స్థితిని ఆ విధంగా అంచనా వేశారు. కానీ ప్రేమని అర్థం చేసుకునే గుణం వుండాలి సహజంగా! ఒక వ్యక్తిని అంత వుద్రిక్తంగా ప్రేమిస్తున్నామంటే ... అందుకు కారణం ఆ వ్యక్తిలో తన అభిరుచుల్ని సంతృప్తి పరిచే గుణాలున్నాయనే. దురదృష్టవశాత్తూ ఆ వ్యక్తిలో ఆ గుణాలు నశించిపోయినప్పుడు వెంటనే ఆ ప్రేమ మాసిపోదు. ఆ వ్యక్తి అలా మారటానికి కారణం ఏమిటి? అందుకు తన బాధ్యత ఎంతవరకూ వుంది? ప్రేమను నిలుపుకునే గుణాన్ని తనెలా కోల్పోయానా అని ఆలోచించి చూడాలి. అలాటి ఆలోచనలు లేక పోవటమే ప్రేమలు విఫలం కావటానికి కారణం అనిపిస్తుంది."

గాయత్రిని చూస్తూ మళ్ళీ అన్నాడు సురేంద్ర —

"గాయత్రీ! నేనూ మగవాడినేగానీ మీరను కునేలాటి వాడిని కాదు. నేను కోరుకుంటున్న యువతిని నా దేవతలా చూసుకోవాలని, నా ప్రేమను పంచాలని. ఆమె అలాటి వీలు నాకు కల్పిస్తుందని ఆశపడుతున్నాను. నా ప్రేమ వెనుక బానిసత్వం, అనురాగం వెనుక క్రూరత్వం లాంటి వేమీ లేవు గాయత్రీ."

మంజుల అక్కణ్ణుంచి మెల్లగా జారుకుంది ఎప్పుడో.

ఉద్వేగంతో చెప్పుకుపోతున్న సురేంద్ర కుర్చీ లోంచి లేచి వెళ్ళి గాయత్రి ముందు మోకాళ్ళ మీద కూర్చుని, ఆమె రెండు చేతుల్నీ తన చేతుల్లోకి తీసుకుని "నేను... నేను... నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. ఇవి నా మనసులోంచి వచ్చిన మాటలు. నన్ను నమ్ము గాయత్రి. నన్ను కరుణించి నీవాణ్ణిగా చేసుకో!" అన్నాడు.

అతను చేయి పట్టుకోగానే గుండెనిండా బాధతో వణికిపోతున్న గాయత్రి కొద్దిసేపు అచేతనంగా వుండిపోయింది. తలెత్తి అతని అంతర్యాన్ని గ్రహించాలన్నట్టు సూటిగా చూసింది.

ఇంకొద్ది నిమిషాల్లో ఆమె చెప్పబోయే

## ఇది మేఘ సందేశమూ...

నిర్ణయంమీదే తన జీవితం ఆధారపడి వున్నదన్నట్టు ఆతృతగా చూస్తున్నాడు. ఆ ఊహ అతని మనసును కలచివేస్తుంది. ఇంత ఉద్విగ్నకరమైన క్షణాలు తన జీవితంలో తటస్థపడతాయని ఎన్నడైనా అనుకున్నాడా తను!?

గాయత్రి అతన్నించి తప్పించుకుని దూరంగా నిలబడింది. సురేంద్ర ప్రేమపూరితమైన మాటలు ఆమె హృదయంలో ఎక్కడో తంత్రుల్ని శృతి చేసినట్టు పులకరించిపోయింది.

ఆమెలో అస్పష్టమైన ఆలోచనలు. సంఘర్షణ. అతన్ని చూడగానే తన మనసెందుకిలా పులకించిపోతోంది? ఎందుకు నాలో అతని పట్ల అనిర్వచనీయమైన అభిమానం పెల్లుబుకుతోంది? అతను లేకుండా తను మాత్రం బ్రతగ్గలదా? ఏమో! ఎంత విచిత్రం! ఏనాడూ తన మనసు తనకి ఎదురుతిరగలేదు. సురేంద్ర పరిచయం కలిగిన నాటినుంచి తన మనసు ఇలాగే ఉద్రేకపడుతోంది. అతన్ని గురించిన ఆలోచనలతో తన అంతరంగం పాలసముద్రంలా పొంగుతూంది. ఎంత దూరం చేసుకుందామన్నా సాధ్యం కావటం లేదు గానీ... ఇదెలా సంభవం?"

తను అతని ప్రేమకు అర్హురాలు కాదు. తనచుట్టూ తన వంశం, కులం, మతం ఒక పరిధిని గీసింది. అది తను దాటలేదు. దాటి బ్రతకలేని మూర్ఖురాలు, అధైర్యవంతురాలు తను. ఆ ఆలోచన రాగానే సుడిగాలి తాకిడికి అల్లాడిపోతున్న నావలా ఆమె హృదయం కంపించి పోయింది. బాధతో కళ్ళు మూసుకుంది.

"గాయత్రీ" ప్రేమతో పిలిచాడు.

ఆమె కళ్ళు తెరచింది. కనురెప్పల మధ్య అస్పష్టంగా కదిలిన నీటిపొరని గమనించి విచలితుడయ్యాడు సురేంద్ర.

"గాయత్రీ! ఎందుకు... ఎందుకిలా వున్నావు. నా మాటలు నీ మనసుని నొప్పించాయా! నువ్వు కనిపించిన ఆనందంతో నీ చుట్టూ తిరుగుతున్న నా ఆలోచనలు... అనుకోకుండా నీ ముందు పరచాను ... నన్ను క్షమించు గాయత్రీ."

చివ్వున తలెత్తి నిర్లక్ష్యంగా సురేంద్రని చూస్తూ సమ్మోహనకరమైన నవ్వు విసిరింది. ఆమె కళ్ళల్లో అవహేళన తొంగి చూసింది. తామిద్దరూ ఒకటి కాలేమన్న దృఢ నమ్మకంతో ఆమెలో దుఃఖం, అసహాయత...ఆమెకు తనమీద తనకే కోపం రగిలింది. అతన్ని తన ఆలోచనల్నుంచి దూరం చేయాలనే, మనసును రాయి చేసుకుంది.

"నేను మీ మాటలు నమ్మను. ఇలా మాయ మాటలు చెప్పే మొగాళ్ళని చాలా మందిని చూశాను. ఇప్పుడు మీరు మీ ఉద్దేశ్యం ఉత్తమమైందని అంటారు. కానీ సమయం వచ్చినపుడు గానీ దాని సహజరూపం బయట పడదు. అలాటి వాళ్ళని నమ్మి మోసపోయేంత తెలివితక్కువదాన్ని కాదు. నేను మిమ్మల్ని ప్రేమించలేను."

సురేంద్ర తెల్లబోయి చూశాడు. మాట్లాడుతున్నది గాయత్రేనా?!అని అనుమానం కలుగుతున్నది. పువ్వుల్లో మృదుత్వాన్ని, వెన్నెల్లోని చల్లదనాన్ని తనలో నింపుకుని ముగ్ధ మనోహరంగా, సౌమ్యంగా కనిపించే గాయత్రి ఇంత అహంకారంగా ఎలా మాట్లాడగల్గుతూంది? అతని మనసు బాధతో బరువెక్కింది. అతని అహం దెబ్బతిన్నది.

"మనిషిలోని ఔన్నత్యాన్ని చూడలేకపోవటం అర్థంలేని గర్వానికి ప్రతిబింబం గాయత్రీ."

అతని కంఠంలోని అధికారానికి విస్తుపోయి చూసింది. ఆమెలోని నిర్ణయం మరింతగా బలపరుచుకున్నట్టుగా మళ్లీ అంది.

"అధికారంతో నా నుండి ప్రేమను సాధించాలని ప్రయత్నించకండి. అది మనసులోంచి పుట్టుకురావాలి. మీకూ నాకూ మధ్య ఏ విధమైన అనుబంధం వుందని అధికారం చూపిస్తున్నారు? అందుకే మీ మగాళ్ళంటే నాకు ... అసహ్యం."

ఆమె గుండె వేగంగా కొట్టుకుంటోంది. ఆవేశంతో రొప్పుతున్న గాయత్రిలో ఆవేదన పొంగింది. సురేంద్రను ఎన్నెన్ని మాటలంది? ఆ దుఃఖాన్ని దిగమింగుకుంటూ అతికష్టంమీద అక్కణ్ణించి బయటికి వెళ్లబోయింది గబగబా.

వాళ్ళిద్దరికీ ఏకాంతం కల్పించాలనే దృష్టితో క్రిందికి వెళ్ళిన మంజుల కాఫీకప్పులతో

గుమ్మం దగ్గర ఎదురయింది. గాయత్రి ఆమెను చూసి ఒక్కక్షణం ఆగింది.

"అరె ... అప్పుడే వెళ్ళిపోతున్నావేం గాయత్రీ ! కాఫీ తీసుకో" అంది.

గాయత్రి ఏం మాట్లాడకుండా మరుక్షణంలో క్రిందికి వెళ్ళిపోయింది. సురేంద్ర అచేతనంగా నిలబడిపోయాడు.

"నువ్వేం బాధపడకు సురేన్. దాని మొహంలో ఫీలింగ్స్‌నిబట్టే దాని మనసేమిటో నాకు అర్థం అయిపోయింది. అది నిన్ను ప్రేమిస్తోంది. కానీ నేననుకున్న విధంగానే భయపడుతోంది. ఆ బాధలో ఏదేదో మాట్లాడి వుంటుంది ... నేను తనతో మాట్లాడి ధైర్యం చెప్తాలే" ఆలోచిస్తూ అంది మంజుల.

సురేంద్ర నీరసంగా కుర్చీలో వాలిపోయి బాధగా కళ్ళు మూసుకున్నాడు. మంజుల క్రిందికి వెళ్ళేసరికి వినోద్, అతని తండ్రి ప్రభాకరరావుగారూ, తల్లి శ్రీలక్ష్మిగారూ హాల్లో కూర్చుని వున్నారు. గాయత్రి పార్వతిగారి పక్కన కూర్చొని వినోద్‌తో ఏదో చెప్పి పకపకా నవ్వుతూంది.

పైన జరిగిన సంఘటనల తాలూకు ఛాయలు ఆమె మొహంలో ఎక్కడా కనిపించటం లేదు.

"హలో ! ఎంత సేపయింది వచ్చి" అని వినోద్‌ని పలకరిస్తూనే 'నమస్తే అంకుల్, ఆంటీ' అంటూ వాళ్ళని కూడా పలుకరించింది.

"ఇప్పుడే ... ఓ పదినిమిషాలైంది" అన్నా రాయన. అందరూ కబుర్లలో పడ్డారు.

"వినోద్ వచ్చినట్లు నాకు చెప్పలేదేం మంజూ !" నిష్ఠూరంగా అంది గాయత్రి.

"బావుంది. నన్ను చెప్పనిస్తేగా నువ్వు. అదే చెప్దామని వస్తే భస్మం చేసేలా ఒక చూపు విసిరి వచ్చేశావు. భయంతో నేను పరుగెట్టుకొచ్చాను."

"అదేమిటి ! గాయత్రినేదో అనేవుంటావు. లేకపోతే నీ మీద కోపమెందుకొస్తుందసలు ?" అన్నాడు నవ్వుతూ వినోద్.

మంజుల కళ్ళెగరేసి చూస్తూ అంది —

"ఏయ్ ! గాయత్రి నీకేం లంచం ఇచ్చింది; తనని సపోర్టు చేస్తున్నావు ?"

"లంచాలివ్వనవసరంలేదు. ఎవరు గడుసు వాళ్ళో ఎవరు నెమ్మదస్తులో ఇక్కడ అందరికీ తెలుసు."

మంజులకి ఎక్కడలేని ఉక్రోషం వచ్చేసింది.

"గాయత్రి పైకి అలానే కన్పిస్తుంది. ఒక్కోసారి ఎదుటి మనిషిని ఎంత ఏడిపిస్తుందో నీకేం తెలుసు. అయినా నన్ను గడుసుదాన్ని అంటావా; ఉండు..." అంటూ శ్రీలక్ష్మిగారి నుద్దేశించి "ఆంటీ, రాత్రికి విన్నీకి నో టిఫెన్, నో మీల్స్... కాఫీ కూడా ఇవ్వకండి. అతనికి అదే పనిష్మెంట్." అంది.

ఆవిడ నవ్వి "వాడసలే ఆకలికి ఆగలేడమ్మా ! ఈ ఒక్కసారికి వాణ్ణి క్షమించి వదిలెయ్" అన్నారు... మంజులను మరింత ఏడిపించాలని.

ప్రభాకరరావుగారు వీళ్ళ సంభాషణకు నవ్వుకుని... మంజులతో అన్నారు ఆప్యాయంగా—

"నేను మాత్రం నీవైపే వుంటానమ్మా ! ఈ రాత్రికి విన్నీకి ఆ పనిష్మెంట్ ఇప్పించే బాధ్యత నాదే ! సరేనా."

"థాంక్యూ అంకుల్" అంటూ వినోద్‌ని వెక్కిరించింది.

అందరూ పకపకా నవ్వేశారు, వినోద్‌తో పాటు.

"ఏమ్మా గాయత్రీ... మా ఇంటికి రావటం మానేశావేం ?" శ్రీలక్ష్మిగారు అడిగారు. మంజుల ద్వారా గాయత్రి ఆ కుటుంబానికి కూడా స్నేహితురాలైంది. అప్పుడప్పుడు మంజులతో వాళ్ళింటికి వెళ్తూండేది ! వినోద్ ఊళ్ళో లేనందువల్ల గాయత్రి వాళ్ళింటికి వెళ్ళటం తగ్గించేసింది.

"ఆవిడకి పెళ్ళయిందిలెండి. పదిమంది పిల్లలతో రోజంతా వాళ్ళ అల్లరికి సతమతమవుతూ బాధపడుతూంటే ఇక మన ఇళ్ళకు రావటానికి ఎక్కడ తీరుతుంది ఆంటీ !" హాస్యంగా అంటున్న మంజుల మాటలకు శ్రీలక్ష్మిగారు పకపకా నవ్వారు.

గాయత్రి కాస్త సిగ్గుపడి... మంజులనోసారి సీరియస్‌గా చూసి —

"లేదండీ ! వీలుపడకకాదు. ఏదో అశ్రద్ధ అయిపోయింది. వినోద్ మలేషియా వెళ్ళిపోతున్నాడు కదా ! అప్పటివరకూ మంజులా నేనూ వచ్చి మీ ఇంట్లో వుండిపోతాం సరేనా" అంది శ్రీలక్ష్మిగారితో.

"డెఫినెట్‌లీ!" అన్నారు ప్రభాకరరావుగారు.

కొద్ది నిమిషాల తర్వాత మంజుల లేచివెళ్ళి మెట్లదగ్గర నిలబడి పైకిచూస్తూ "సురేన్ ! రెడీ అయితే క్రిందికిరా! వినోద్‌వాళ్ళు వచ్చారు" అని గట్టిగా పిలిచింది.

ఆమె పిలుపువిని పడుకున్నవాడల్లా గబగబా లేచి డ్రెస్ చేసుకుని క్రిందికి వచ్చాడు సురేంద్ర. అతని రాకతో వాతావరణం నిశ్శబ్దం అయింది. వినోద్‌ని విష్ చేశాడు. మంజుల ప్రభాకరరావుగారిని, శ్రీలక్ష్మిగారిని అతనికి పరిచయంచేసింది.

నమస్కారాలు పూర్తయ్యాయి.

పార్వతిగారిపక్కన కూర్చున్న గాయత్రిని చూశాడు సురేంద్ర. సురేంద్ర తనను చూడటం గమనించిన గాయత్రికి అంతక్రితం జరిగిన సంఘటన జ్ఞాపకంవచ్చి మనసు కలతపడింది, అక్కడ కూర్చోవటం ఇష్టంలేనిదానిలా లేచి నిలబడింది.

"ఇక వెళ్ళొస్తానండీ ! కిరణ్ బేబీలు నా కోసం భోజనం చేయకుండా ఎదురు చూస్తుంటారు" అంది అందర్నీ ఉద్దేశించి.

మంజుల తనలో తను నవ్వుకుంది. సురేంద్ర మనసు చివుక్కుమంది. అప్పటి వరకూ వాళ్ళందరితో హాయిగా మాట్లాడుతూ కూర్చున్న గాయత్రి తనని చూడగానే వెళ్ళొస్తానని లేవటం అతనికి బాధ కల్గించింది. తను అక్కడికి రాకుండావుంటే బావుండేదనుకున్నాడు మనసులో.

"ఏం ఫర్వాలేదు — గాయత్రీ! కొద్దిసేపు కూర్చో, నేను డ్రాప్‌చేస్తాన్లే !" అన్నాడు వినోద్.

"ఔనమ్మా ! అందరం కలిసే వెళ్దాం ! విశ్వనాథంగారు బైటకి వెళ్ళారుకదా ! ఆయన కూడా రాగానే మాట్లాడి వెళ్ళిపోదాం." అన్నారు ప్రభాకరంగారు. పెద్దాయన చెప్పింతర్వాతకూడా వినకుండా వెళ్ళిపోవటం బావుండదని... సందిగ్ధంలోపడిన గాయత్రి... మౌనంగా మళ్ళీ కూర్చుంది. అందరూ పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

వినోద్ అందరి సంభాషణలో పాల్గొంటున్నా అతని చూపుమాత్రం మంజులమీదే వుండటం, తనని తినేసేలా దొంగచూపులు చూస్తున్న అతన్ని సైగలతోనే మంజుల వారించటం గమనిస్తున్న గాయత్రి మంజుల దగ్గరగా జరిగి ఆమె చెవిలో మెల్లగా అంది —

"ఎంత అవస్థ వచ్చిపడింది మంజూ ! ఆంటీకి చెప్పేయనా ! వినోద్‌కి, నీకూ పెళ్ళి చేసేయమని." —

మంజుల ఉలిక్కిపడి గాయత్రిని చూసింది.

"చాల్లే వూరుకో ! ఇప్పుడు చెపితే నీకూ నాక్కూడా కర్రతో పెళ్ళి చేసేస్తుంది మమ్మీ!" అంది మెల్లగా.

మాటల్లో చాలా సేపు గడిచిపోయింది. విశ్వనాథంగారు రానేలేదు అంతవరకూ.

"ఇక వెళ్ళొస్తామమ్మా మంజులా ! డాడీకి ఇప్పుడు దాకా కూర్చుని వెళ్ళామని చెప్పు ! సురేంద్రని తీసుకుని నువ్వూ, గాయత్రి ఓసారి ఇంటికి రండి" అంటూ బయటికి దారి తీశారు.

వినోద్ మంజుల దగ్గరగా వచ్చి చెవులో ఏదో అన్నాడు. మంజుల ముసి ముసి నవ్వులు నవ్వింది.

మంజుల, సురేంద్ర గేటు వరకూ వెళ్ళారు వాళ్ళని సాగనంపటానికి. గాయత్రి శ్రీలక్ష్మిగారి పక్కనే వెనక సీట్లో కూర్చుంది. ఆమె తన వైపు చూస్తుందని, తనతో వెళ్ళొస్తానని చెప్తుందని ఆశపడ్డ సురేంద్ర... దిగులుగా, భారంగా మంజులతో లోపలికి నడిచాడు.

* * *

అందరూ నిద్రపోయిం తర్వాత గాయత్రి ఏదో నవల తీసుకుని ఒంటరిగా ... ఈజీ చైర్‌లో పడుకుని టేబిల్ లైటు వెలుగులో చదువుతోంది. పేజీలు తిరగేస్తోంది కానీ ...

# ఇవేమన పద్యాలు







కానివాని తోడ కలసి వర్తించిన
హానివచ్చు నెంతవానికైన
తాటిక్రింద పాలు త్రాగిన విధమౌను
విశ్వదాభిరామ వినురవేమ.

దృష్టి దానిమీద లగ్నం కావటం లేదు. మంజుల వాళ్ళింట్లో జరిగిన సంఘటనవల్ల ఆమె మెదడు మొద్దుబారినట్లయింది. పరస్పర విరుద్ధమైన మానసిక భావాలు మొదలయ్యాయి. ఆమె ఆలోచనల నిండా సురేంద్ర అలుముకున్నాడు.

సురేంద్రను తలుచుకోగానే ఏదో తపనతో ఆర్తితో... ఆమె మనసు భగ్గున మండుతోంది. నిన్నటి తన ప్రవర్తనవల్ల సురేంద్ర తన గురించి ఎంత అసహ్యంగా ఊహించుకుంటున్నాడో! తనొక రాక్షసిలా... మనసులేని దానిలా కనిపించింది అతనికి. తన మాటలకి అతనెంతగా బాధపడుతున్నాడో! నెమ్మదిగా, మలయమారుతంలా వుండే సురేంద్ర మొహం ... ఆ క్షణంలో తన పొగరు మాటలకు ఎలా వాడిపోయిందో !

తను నిజంగా రాక్షసి. తనకి ఇష్టంలేదని, ధైర్యం లేదని ఒక్క మాట చెప్పేస్తే ... మరోలా వుండేది. కాని తను మాత్రం ఎలా చెప్పగలదు ? తన మనసు అందుకు అంగీకరించటం లేదే !

సురేంద్రని చూసిన క్షణం నుంచి తన మనసెందుకో మెత్తబడుతూంది. అతని కోసం తహ తహ పెరిగిపోతూంది. అతని రాక తన కోసమేనని, అతని ప్రేమ తనకు వరమని మనసు పులకరిస్తూంది. అంతర్గతంగా తనకు తెలీకుండానే రగులుతున్న ఏదో బాధ అతని చిరునవ్వుతో పటాపంచలయినట్టు, ఆర్తితో అతన్ని పెనవేసుకుపోవాలని, అతని ఒడిలో వాలిపోయి విశ్రాంతి తీసుకోవాలని, అతని ఎదపై తలవాల్చి తన ఆవేదన చెప్పుకుని హాయైన అనుభూతి పొందాలని... ఎన్ని కోరికలు కలుగుతున్నాయో !

ఎందుకిలా అయిపోవాలి నేను ? ఎందుకింత ఆవేదన పుట్టుకొస్తూంది ? నా ఆలోచనలు నా గుండెల్లో అగ్నిపర్వతాల్ని బద్దలు చేస్తున్నాయి. అవి నా జీవితాన్ని ఏ మార్గాన నడిపిస్తాయో ! నా మనసు నా సురేంద్ర కోసం పూచిన పువ్వులా అతనికే అంకితం కాగలదా ? లేక మనసులేని తనువులా, పరిమళంలేని పువ్వులా ఎవరిసొత్తో అయి నలిగి నాశనం కాదు కదా !?

ఆ ఊహకి ఆమె భయకంపితురాలైంది.

కులం గోత్రం అంటూ ఇంకా ఆ ఆలోచనలను పట్టుకు వేలాడే తన తండ్రి తన మాట మన్నిస్తాడా ! లేదు. ముమ్మాటికీ ఆయన అంగీకరించరు. మరి యీ సమస్య ఎలా పరిష్కారం అవుతుంది ? కని, పెంచిన తండ్రిని కాదని, రక్త సంబంధాల్ని తెంచుకుని, నా స్వార్థం నేను చూసుకుని అనురాగపు అందాల్లో విహరించనా ? పెద్దవాళ్ల మూర్ఖపు పట్టుదలకు తలవంచి, ప్రేమను మసిచేసి ప్రేమలేని బతుకు గడపనా! ? —అదే ఆనందమా జీవితానికి !! అప్పుడు కలుగవా సమస్యలు ? ఇలా ప్రేమించలేక, ప్రేమను పొందలేక బతుకు నరకంలా బతకటంకంటే. యీ ఆచార వ్యవహారాల మీద ధ్వజం ఎత్తి, తండ్రికి నచ్చచెప్పి మనసైన మనిషిని చేసుకుంటే ... మరికొంత కాలానికైనా తన తండ్రిలో మార్పు కలిగి తన పనిని హర్షించరా !!

ఈ ఆలోచన కాస్త ఆశను, ఆనందాన్ని కలిగించింది. సురేంద్ర తన మాటలకు ఎంత మధనపడుతున్నాడో !? సురేంద్ర లేకుండా తనూ బ్రతకలేదు. అతనికి దూరమై జీవించటం సాధ్యమా అసలు ?! రేపే అతని సన్నిధికి వెళ్ళాలి! సురేంద్రకు తన ప్రేమ పారవశ్యంలో స్వాంతన పరచాలి. ఆర్తిగా గుండెలకు హత్తుకుని ఊరట కలిగించాలి. అప్పుడు అతని కళ్ళల్లో మెరిసే కాంతులు నా కళ్ళారా చూసుకుని మురిసిపోవాలి.

ఏమిటీ ఆలోచనలు ! తన మనసులో ఇప్పుడేమిటో సంతోషపు సవ్వడి వినిపిస్తోంది. ఆ సవ్వడి సురేంద్రకు వినిపించాలి. అప్పుడు అతని భావాలు ఎలావుంటాయో ! ఆ విధమైన ఆలోచనలతో ఆమెకు కాస్త మనశ్శాంతి దొరికినట్టయింది. లైట్ ఆఫ్‌చేసి పక్కమీద వాలింది గాయత్రి.

[ఇంకా వుంది]

# ఇంట్లో అమ్మ చేసిన కాఫీకి యోగ్యమైన బిరుదు.



ఇంట్లో వాళ్ళందరికీ ఏది మంచిది అన్నది అమ్మ కన్నా మించి ఇంకెవరికీ తెలుస్తుంది!

ఇక కాఫీ రుచి విషయం ఎత్తామంటే అమ్మదే తుది నిర్ణయం. ఆ నిర్ణయంపైనే అందరికీ గౌరవం.

అందుకు కారణం కాఫీ చేయడంలో అమ్మ అనుభవసారమే. అనుదినం అమ్మ చేతి కాఫీ తెచ్చే ఆ తొలి వెలుగుల తాజాదనం తిరుగులేనిది. దాన్ని తయారుచేసి అందించే అమ్మ చేయి అంతకన్నా తిరుగులేనిది.

అది అమ్మ హస్తవాసి అందమా, లేక ఆమె రహస్యమందమా! చక్కని రుచీ,సువాసనా ఇచ్చే ఆ ఖచ్చితమైన రంగుకు కాఫీ విత్తుల్ని వేయించడం, ఆ పొడి కొట్టడం, పడకట్టడం...



ఇక చుక్క చుక్కగా కిందికిదిగే ఆ డికాక్షన్ చిక్కగా ముదురు రంగుతో నోరూరించే దాని సువాసన, నురుగు తేలుతూ, పొగలు కక్కుతూ అది అందించే ఆహ్వానం. అబ్బ! ఆ తాజాదనపు సువాసనకు జోహార్లు చెప్పాలి. నురగల బుడగలలో దోబూచులాడుతూ వచ్చే ఆ రుచికి జేజేలు పలకాలి.

ఆ మేళవింపులో పరిపూర్ణత సాధించడానికి ఎన్నేళ్ళ తపస్సు అవసరమైందో!

## సన్‌రైజ్. శ్రేష్ఠతకొక బిరుదు.

ఇంట్లో అమ్మ చేసే కాఫీ గురించి మాకు అన్నిటికన్న ఎక్కువగా నచ్చిన విషయం అదిచ్చే ఆ "తొలి వెలుగుల తాజాదనపు" అనుభూతి.

అందుకే మా మిశ్రమానికి "సన్‌రైజ్" అన్న పేరు పెట్టాం. అదెంత మంచిదంటే, అత్యుత్తమమైన కాఫీకి అదొక యోగ్యమైన బిరుదు అని మా విశ్వాసం.

## అమ్మ పద్ధతే అచ్చంగా మా పద్ధతినూ

అమ్మలాగే, కాఫీ గొప్ప అంతా 'సరైన' కాఫీ



విత్తుల ఎంపికలోనే ఉందన్న సంగతి మేమూ గుర్తించాం. అందుకే, చిక్కదనం, సువాసనా సరైన పాళ్లలో ఇచ్చే కాఫీ విత్తుల ఎంపికలో మా నిపుణులు శిక్షణ పొందారు.

అమ్మ చేసినట్టుగానే మేమూ కాఫీ విత్తుల్ని సరిగ్గా తగినంతమేరకు వేయిస్తాం. అలా ఆ చిక్కదనం, సువాసన, రంగు పరిపూర్ణ స్థాయిలో వచ్చేలా చేస్తాం.

సరిగ్గా అలాటి సమయంలో ఆ విత్తుల్ని అతి వేగంగా చల్లారుస్తాం. దానితో వాటి మంచితనం. సువాసన, రుచి, చిక్కదనం, రంగు అన్నీ అలా అందులో నిలిచిపోతాయి.

ఆ విత్తుల్ని నాజూగ్గా పొడికొట్టి, బ్రహ్మాండమైన పర్కొలేటర్లలో వడపోస్తాం. దీనితో ముదురు రంగుతోటి, ముగ్ధుల్ని చేసే సువాసనతోటి అతి చిక్కని డికాక్షన్ తయారవుతుంది.

అనుదినం ఉదయం పూట అమ్మ కాఫీ రుచికి నోచుకున్న వారందరికీ ఇది సుపరిచితమైందే.

## చిక్కని డికాక్షన్ నుంచి మళ్ళీ పొడి.

ఈ దశలో డికాక్షన్‌ను సుతారంగా ఆరబెట్టడం ద్వారా దాన్ని పొడి రూపంలోకి మార్చడం జరుగుతుంది. ఈ పద్ధతి వెనక 40 ఏళ్ళ పరిశోధన, అనుభవాల పరిపూర్ణత ఉంది.

ఇక బంగారు గోధుమ రంగులో ఉన్న ఆ పొడిలో తాజాదనం, సువాసన సమృద్ధిగా ఉంటాయి.

## ఆ తాజాదనాన్ని అలా నిలిపి ఉంచడం కోసం

ఆ పొడిని జాడీలలోకి, సంచీలలోకి నింపి, దాని సువాసన, రుచి, చిక్కదనం అన్నీ అందులోనే దాగి ఉండేలా సీలుచేయడం జరుగుతుంది. ఆ గుణాలన్నీ కలసి ఏ వేళలోనైనా, ఏ జాములోనైనా



## ఆ సన్‌రైజ్ తొలివెలుగుల తాజాదనపు అనుభూతి మీకు నిస్సందేహంగా అందుతుంది

ఇక సన్‌రైజ్ అచ్చంగా ఇంట్లో అమ్మ పద్ధతి లోనే తయారవడం వల్ల, ఆ శ్రేష్ఠతకు ఇదొక యోగ్యమైన బిరుదే అనవచ్చు కదా మరి!




కొత్త
Nestlé
సన్‌రైజ్
ఇన్‌స్టెంట్

## ఇంట్లో అమ్మ చేసిన కాఫీ అందించే ఆ తొలివెలుగుల తాజాదనపు అనుభూతి కోసం.

ఎంపిక చేసిన పట్టణాలలో మాత్రమే లభించును.

HTD-FSL-7910 TEL

# కొత్తగొంతులు

— టి.యస్. కాంతారావు

ఇది ప్రగతికాదు... మానవవికృతి
ఇది అభ్యుదయంకాదు...
విషవీచికామయం
ధర్మ ప్రభంజనం జరిగిపోయింది
పాపవిహారం సాగిపోతోంది
వదేండ్ల ప్రపంచపు ప్రోగ్రెస్
మైనస్ మార్కులతో పూర్తిగా
మలినమైపోయింది.
— రామాచంద్రమౌళి

ధ్వని, ప్రతిధ్వనుల సమ్మేళనంతో వచన కవితా రంగంలోకి ప్రవేశించిన కవి రామాచంద్రమౌళి. దీపశిఖ కవితా సంకలనంలో తనదైన కవిత్వపు ధ్వని, శిలలు వికసిస్తున్నాయి కవితా సంకలనంలో తనదికాని ప్రతిధ్వని వినిపిస్తుంది. దీపశిఖ 1971 లోనూ శిలలు వికసిస్తున్నాయి 1979 లోనూ వచ్చాయి. వస్తువు సమకాలీన జీవితం; రూపం వచన కవిత్వం. ఇక్కడ జీవితాన్ని, జీవితంలోని నైరాశ్యాన్ని, వైఫల్యాన్ని, పీడనను, అందువల్ల ఉత్పన్నమైన వేదనను, అమాయకతను, జడత్వాన్ని తన కవిత్వరూపానికి ఆత్మగా చేసుకున్నారు రామాచంద్రమౌళిగారు. గుండెల్లో దిగిన గునపాల అంచుల్ని ఊర్చి, బ్రతుకులలోని పచ్చదనాన్ని కార్చిన రసంతో రంగరించి, తన కలం కళ్ళలోనుండి రక్తాశ్రువులను రాలుస్తూ, రుధిర పుష్పాలను పేర్చి మూసిన పిడికిలిని తెరచిన కవి రామాచంద్రమౌళి. భూగోళాన్నొక బంగారు ముద్దగా చేయటానికి అందని పృథ్విమట్టూ అఖండ దీక్షతో పరిభ్రమిస్తూ, ఈ వర్తమానాంధకారంలో జ్యోతిని వెలిగించి, ద్యుతుని పూయించాలనే మహాసంకల్పంతో కవితా జైత్రయాత్రకు బయల్దేరిన కవి శ్రీ రామాచంద్రమౌళి.

అవయవాలన్నీ ఒకటే అయినా మనుషుల రూపాల భిన్నత్వమున్నట్లుగానే ప్రక్రియ వచన కవిత్వమే అయినా, వస్తువు సామాజికమైనదే అయినా అభివ్యక్తీకరణలో ఆయన ప్రత్యేకత ఆయనకున్నది. చెమట ఓడ్చి ఓడ్చి సత్తువను కోల్పోయిన చేతుల్ని చూశాడు; గొంతు తడి ఆరిపోయి గుండెల్లోంచి నిస్స్వరంగా వెలువడుతున్న ఆర్తనాదాన్ని విన్నాడు; అంధకారాన్ని చూసి చూసి కాంతిని పోగొట్టుకున్న కళ్లను చూశాడు; కన్నబిడ్డకు పాలరక్తాన్ని అందించటానికి మానాన్ని కోల్పోతున్న ఓదాలనుచూశాడు; అంటీ కరప్షన్ ఆఫీసరు దొంగ వ్యాపారి ఇంట్లో తాగిన విస్కీ మత్తులో సత్యాన్ని రక్తం కక్కించటం చూశాడు; సివిలిస్ సమాజపు కాబరీ నృత్య ప్రదర్శనను తిలకించాడు. వికీర్ణభూతాన్ని చూసి నిలబడటమా? ఆశలను పెంచుకుని ముందుకు నడవటమా? అనే సంశయాత్మక వాదంలో పడినా, నిర్మాతను కాను నిర్భాగ్యుడనని చెప్పుకున్నా, ఆశావాదిని కాను అభాగ్యుడనని తేల్చుకున్నా మళ్ళా ఈ నిరాశాంధంలోంచి తేరుకొని, బాధాతప్త హృదయాలలో చైతన్య స్రవంతులను పొంగించాలని, నిరాశల రాగాలతో ఎండిపోయిన హృదయాల్లో ఆరిపోని ఆశాశృతులతో దిగ్భిత్తికలు అదిరేటట్లు కవితా రాగ ఘోష వినిపించాలని నిశ్చయించుకున్నారీ కవి. అందుకనే సువర్ణ శకానికి చరిత్ర ప్రారంభించి, ఆగామి యుగానికి అ ఆ లు నేర్పటమే కాదు; ఆందోళనలు నేర్పి పగిలిన గుండెల్లోంచి ఎర్రని రౌద్ర బింబాన్ని సృష్టిస్తానంటున్నారు. రేపు మాత్రం మళ్ళీ చీకటి గుయ్యారం కాకూడదని ఆశించిన కవి, సమాజపు ఆవేదనను తన ఆవేదనగా కవిత్వాన్ని పలికించిన కవి, చీకట్లోంచి వెలుగు కోసం వెంపర్లాడుతున్న కవి తాను తానుగానే ఉండాలి గాని పేరుబడ్డ కవుల అండన చేరకూడదని ఆశించిన కవి అనంతర కాలంలో తన అభిప్రాయాలకు వ్యతిరేకంగా కాకపోయినా కొంచెం దూరంగా ప్రయాణించడం జరిగింది.

కవిత్వం ప్రజల కోసం అని అనుకోకపోతే పేచీలేదు గాని అనుకున్నట్లయితే కవి ఎక్స్ప్రెషన్ కూడా ప్రజలదే అయి ఉండటాన్ని ఆశిస్తాం. కవిత్వం వాచ్యార్థంలోంచి పుట్టిందని ఎవడూ అనడు. ఏ అర్థం లోంచి కవిత్వం పుట్టినా దాని ఉద్దేశాన్ని బట్టే దాని రూపం, గుణం ఆధారపడి ఉంటాయి. కవితాశయం మహోత్తమమైనదై అది నిర్వర్తించవలసిన బాధతకు దాని గుణం వ్యతిరేకం అయినప్పుడు దాని ప్రయోజనమేమిటి? అనేది ప్రశ్నగా మిగిలిపోతుంది. క్రింది వర్గాల దారి పురోగమనాన్ని ఆశిస్తూ హైబ్రో కవిత్వం రాయడంతో ఆ వర్గాలపట్ల కవికి గల గాఢానుభూతి అనుమానాస్పదంగా నిలిచిపోతుంది. కవిత్వంలో ఎన్ని చమక్కులైనా చేయవచ్చు; నగిషీలు చెక్కవచ్చు; ఇమేజిజం పేరుతో ఎన్ని భావ చిత్రాలయినా అందించవచ్చు. కాని దాని పరమార్థమే దెబ్బతిన్నప్పుడు ఈ చమక్కులు, నగిషీలు, భావ చిత్రాలు కవితాత్మను అందనివ్వకుండా శవాలంకరణాలుగా మిగిలిపోతాయి. స్పానిష్ కవిత్వంలో, ఫ్రెంచి, అమెరికా, ఇంగ్లండ్‌కు చెందిన కవిత్వాల్లో ఎన్ని మార్పులైనా రావచ్చు. వాటిని తెలుగులోకి దిగుమతి చేసుకునేటప్పుడు కవులు ముఖ్యంగా యువ కవులు తెలుగు పాఠకలోకాన్ని జ్ఞప్తిలో ఉంచుకోవాలి. కవి ఎక్కడో శిఖరాగ్రంమీద కూర్చుని పాఠకులను తన దగ్గరకు రమ్మనటం సామాజిక పరిణామాన్ని ఆశించే కవి లక్షణం కాకూడదు. కవికి, పాఠకునికి మధ్య తెర సున్నితమైంది అయి ఉండాలిగాని మందపాటిది పనికిరాదు. ఒకవేళ అట్లా అయితే కవి దారిది కవిదే; పాఠకుడు దారి పాఠకుడిది అవుతుంది. అప్పుడు కవి దేశాన్ని పాఠకుల్ని శాపనార్థాలు పెడతాడు. దానివల్ల ఫలితమూ శూన్యమే.



రామాచంద్రమౌళిగారి శిలలు వికసిస్తున్నాయి కవితా సంకలనం శేషేంద్రశర్మగారి ప్రభావంతో రాసినది. ఒక మంచి కవిని అనుసరించటంలో దోషం లేదుకాని ఆ కవిలానే రాయాలనుకోవటం ఎంత మాత్రం క్షేమం కాదు. విశ్వనాథవారిలా పద్యం, విమర్శ రాయాలని ప్రయత్నించి కొంతమంది ప్రముఖులు చతికిలబడిపోవటం మనకు తెలియని విషయం కాదు. తెచ్చిపెట్టుకున్న వేదనకు, హృద్గతమైన వేదనకు మధ్య దూరం చాలా ఉంది. దీపశిఖలో కవిత్వం రామాచంద్రమౌళిగారి సొంతం. శిలలు వికసిస్తున్నాయిలో కవిత్వం చంద్రమౌళిగారిదేనా అని అనిపించకమానదు. రెండు సంకలనాలలోనూ సాంఘికవేదనే వస్తువైనా మొదటిది వాస్తవమై రెండవది భ్రాంతిమయ మవుతోంది. 'నాకు చెమటంటే యిష్టం — ఎందుకంటే చెమటలో నుండే యీ ప్రపంచం పుష్పించింది' అనే కవి ఆ చెమటకు సంబంధించిన ఎక్స్ప్రెషన్ నుండి, సంవిధానం నుండి విలియనేట్ అయిపోవటం హర్షణీయం కాదుగదా! రామాచంద్రమౌళి గారికి కవిత్వ రచనా శిల్పం తెలుసు. ఆ శిల్ప ప్రయోజనానికి అనుగుణంగా ఆయన గొప్ప కవిత్వం రాయగలరు.

యీ నా జాతికి ఎన్నడూ శాంతి లేదు
ఎందుకంటే — అశాంతితో కొండంత
కర్తవ్యంలోకిచొచ్చుకుపోవాలి కాబట్టి
నా చేతుల కెన్నడూ విశ్రాంతి లేదు
అవి గుప్పెట్లోనుండి నా దేశాన్ని
సృష్టించాలి కాబట్టి
అందుకే ప్రవాహాలన్నా
పక్షి రెక్కలన్నా నా కిష్టం —
నేను
సూర్యుడు సిగ్గుపడాల్సిన దినం కోసం
ఎదురుచూస్తున్నాను.
అందుకే అరవై కోట్లమంది సూర్యుళ్ళను
తయారుచేస్తున్నాను. ★

# మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు

## సబ్బు- ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్.
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్.

Imageads-M-1564






జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

ప్రేమ్ – తాజాతనము నందించు సబ్బు.

# దావణగెరె

## అందంచిందే సమ్మేళనతో నూతన సరళి కల్పన !




*టెరీన్ — కేళీవారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్

**దావణగెరె**
ఫ్యాషన్ వస్త్రములు

ది దావణగెరే కాటన్ మిల్స్ లిమిటెడ్
హనుమంతప్ప బిల్డింగ్స్, చిత్రదుర్గ రోడ్,
దావణగెరే 577 002.

షోరూములు :
కావేరి భవన్, బెంగుళూరు-560 009.
దాజీబాన్ పేట్, హుబ్లి-580 020.
చిత్రదుర్గ రోడ్, దావణగెరే-577 002.




"గదిలో ఉక్కగా వుందని హీరోయిన్ బట్టలు విప్పేస్తుంది- అది మీరు కత్తిరిస్తే ఎట్లా?"



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "మూగవాడి పగ"

తాపీ మేస్త్రీగా వృత్తి నారంభించి, అచిర కాలంలోనే భవనాల కంట్రాక్టర్ అయి, ఆ తర్వాత సుప్రసిద్ధ కన్నడ చిత్ర నిర్మాతగా వాసి కెక్కిన వి.ఎల్.అబ్బాయినాయుడు చిత్తూరు వాస్తవ్యుడు. ఈయన ఎంబ్లెమ్‌లో తాపీ పనిముట్టు ఉంటుంది. "కన్నడంలో నా చిత్రాలన్నీ ఘన విజయం సాధించడానికి కారణం పటిష్టమైన కథ. చిత్రానికి కథ భవనానికి పునాది లాంటిది. అదే నా విజయ రహస్యం," అంటారీయన. ఈయన కన్నడంలో నిర్మించిన "మూగనసేడు" చిత్రం కర్నాటక రాష్ట్రంలో రజతోత్సవాలు జరుపుకుంది. దీనినే మధు ఆర్ట్ ఫిలిమ్స్ బానర్‌లో మోహన్‌బాబు హీరోగా "మూగవాడి పగ" పేరుతో నిర్మిస్తున్నారు. కవిత, సత్య నారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, గిరిబాబు, త్యాగరాజు, భీమరాజు, కె. విజయ, పుష్పలత, సాధన నటిస్తున్నారు. ఎం. డి. సుందర్, సత్యానంద్, సత్యం, ఆత్రేయ, పుష్పాల గోపాలకృష్ణ, కుదరవల్లి నాగేశ్వరరావు, రవి, నండూరి గోపాల్, సత్యం, ప్రమోద్‌కుమార్ తెర వెనుక కృషి చేస్తున్నారు. "మే 18 నుంచి జూన్ 9 వరకు మద్రాసులో రెండవ షెడ్యూల్ జరుగుతుంది. ఆ తర్వాత మైసూర్ బృందావన్ గార్డన్స్‌లో సాంగ్స్ పిక్చరైజ్ చేస్తాం. దీంతో షూటింగ్ పూర్తయిపోతుంది," అన్నారు డైరెక్టర్ బోయిన సుబ్బారావు.

## "తల్లి ఒడిలో"

ఇది కూడా అబ్బాయినాయుడి చిత్రం. కర్నాటకంలో అరవై వారాలు ప్రదర్శింపబడిన "తాయి మడినల్లి" అనే ఈయన చిత్రాన్ని జయసుధ నాయికగా పై పేరున నిర్మిస్తారు. ఆగస్టు నుంచి అక్టోబర్ వరకు మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది. నిర్మాతే కథకుడు. బోయిన సుబ్బారావు దర్శకుడు

"అమరజీవి"లో అక్కినేని, జయప్రద

# సినిమా

## కృష్ణ నటించే చిత్రానికి కోడి రామకృష్ణ దర్శకత్వం

"ఈ చిత్రంలో రెండు విశేషాలున్నాయి. హీరో కృష్ణగారితో నాకిది తొలిచిత్రం. కృష్ణగారి రెండో అబ్బాయి మాస్టర్ మహేష్ ఈ చిత్రంలో ఒక కీలక పాత్రను ధరిస్తున్నాడు," అన్నారు కోడి రామకృష్ణ. ఈయన దర్శకత్వంలో తయారయ్యే ఎస్. ఆర్. ఫిలింస్‌వారి చిత్రంలో జయసుధ, చంద్రమోహన్, రావు గోపాలరావు, గొల్లపూడి మారుతీరావు, పూర్ణిమ, అన్నపూర్ణ ఇతర పాత్రధారులు. "ఆగస్టులో 11–24 తేదీల మధ్య, సెప్టెంబర్, అక్టోబరు నెలల్లో 11–22 తేదీల మధ్య జరిగే మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తయిపోతుంది," అన్నారు ఈ చిత్ర నిర్మాత ఎస్. రామచంద్రరావు. డిసెంబర్ విడుదల.

'శివుడు—శివుడు—శివుడు' చిరంజీవి



## దూరదర్శన్ వల్ల చలన చిత్రాలకు దెబ్బ

భువనేశ్వర్‌లో టి. వి. పట్ల ప్రజలకు మోజు విపరీతంగా పెరిగిపోయినందువల్ల అక్కడ సినిమాహాళ్ళ వద్ద వసూళ్ళు నలభై శాతం పడిపోయాయి. ప్రకటించిన విధంగా త్వరలో టి.వి.లో వారానికి మూడు సినిమాలు ప్రదర్శింపబడితే పరిస్థితి ఇంకా ఎంత విషమిస్తుందోనని అక్కడి థియేటర్ యజమానులు ఆందోళన చెందుతున్నారట.



'స్వరాజ్యం'లో ఒక దృశ్యం

## "త్రివేణి సంగమం" లో అగ్ని వేగం

త్రివేణి [పవిత్రశ్రీ], చంద్రశేఖర్ [సుమన్] కలిశారు. మాట్లాడుకున్నారు.

"మనం కలిసి మాట్లాడుకున్న శుభ సందర్భంలో కాఫీ తాగుదాం. రాకూడదూ?" అన్నాడు చంద్రశేఖర్.

"రాకూడదు. అరగంటలో మేడమ్ వచ్చేస్తుంది," అంది త్రివేణి.

"అరగంటలో కదా? చూడండి... ట్వెంటీ మినిట్స్ – ఇరవై నిమిషాల్లో మిమ్మల్నిక్కడ దింపేస్తాను. ఓ–కే?" అంటూ మోటార్ బైక్‌ను స్టార్ట్ చేశాడు, చంద్రశేఖర్.

"ఎందుకండీ రిస్కు?"

"రిస్కు లేకపోతే, లైఫే లేదు. కమాన్!"

త్రివేణి వెనుక సీటు మీద కూర్చుంది. కదుపులతో, కుదుపులతో అగు మేఘాల మీద పోనిస్తున్నాడు చంద్రశేఖర్.

భయంగా అతని భుజాలు పట్టుకుంటూ, "ఎందుకండీ అంత స్పీడు?" అంది త్రివేణి.

"మీ కోసమే. స్లోగా నడిపితే, మీకే ఆలస్యం అవుతుంది," అంటూ స్పీడుమరింత పెంచాడు చంద్రశేఖర్.

షాట్ 'ఓ–కే' అయ్యాక "ఆ స్పీడు వారిద్దరి జీవితాలను మార్చేస్తుంది," అన్నారు కె. రాఘవ నవ్వుతూ. ఈయన నిర్మిస్తున్న ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ "త్రివేణి సంగమం"లో గొల్లపూడి మారుతీరావు, సి. ఎస్. రావు, పి. ఎల్. నారాయణ, కాకినాడ శ్యామల, సితార, సురేష్, వందన, విజయలక్ష్మి ఇతర తారాగణం. కొంపెల్ల విశ్వం కథ, మాటలు రాశారు. జె. వి. రాఘవులు సంగీతం, కె. సాంబశివరావు ఛాయ, కె. బాబు కూర్పుతో కొమ్మినేని కృష్ణమూర్తి దర్శకుడు.

## ధర్మేంద్ర సలహా!

"పిక్చర్ చివరన ధర్మేంద్ర చావడం మాపిస్తే, అసలా పిక్చరే చచ్చిఊరుకుంటుంది." ఈ సలహాను ధర్మేంద్ర "క్యయామత్" చిత్ర నిర్మాత సలీమ్‌కు, దర్శకుడు రాజ్. ఎన్. సిప్పీకి సూచించాడు.

## టైటిల్స్ తమాషాలు

చిత్రాల పేర్లలో మొదటి అక్షరం 'ఎ' ఉన్న రాకేష్ నటించిన చిత్రాలు ఫ్లాప్ అయ్యాయి. అవి– "ఆంతో, ఆంఖోమే, ఆహూతి, ఆప్ కె దివానీ, ఆకమాన్."

అలాగే ఋషికపూర్‌కు 'జడ్'తో ప్రారంభమయ్యే టైటిల్స్ బెడిసి కొట్టాయి. మచ్చుకి – "జహ్రీలీ ఇన్సాన్, జిందాదిల్, జమానే కో దిఖానా హై."

ఇద్దరికీ 'కె' తో ప్రారంభమయ్యే చిత్రాలు హిట్స్ అయ్యాయి. ఋషి కపూర్ నటించిన "కర్జ్, కభీ కభీ," రాకేష్ రోషన్ పాల్గొన్న "కామ్ చోర్, ఖుబ్ సూరత్, కట్టా మీటా" చిత్రాలకు మంచి రాబడి వచ్చింది.

దీపక్ బాహ్రి చిత్రాల పేర్లలో "హమ్" అని ఎక్కడైనా ఉండితీరాలి. "హమ్‌సే బడ్కర్ కౌన్" చిత్రం హిట్ అవడంతో ఈయన తాజా చిత్రానికి "హమ్ సే హై జమానా" అని, ఆ తర్వాత నిర్మించే చిత్రాలకు "హమ్ సే నాటక్రానా, హమ్ హీ హమ్ హై" అనే టైటిల్స్‌ను రిజిస్టర్ చేశాడు.

## జయప్రద హిందీ చిత్రాలు

"షరాబీ, జాహిల్" చిత్రాల్లో అమితాబ్ బచ్చన్ సరసన జయప్రద నటిస్తుంది. ఇంకా "మేరా ఫైస్లా, క్యయామత్, భేమా, పాపీ పేట్‌కా సవాల్ హై, మై ఆవారా హూఁ" చిత్రాలతోపాటు పద్మాలయవారి హిందీ చిత్రం లోనూ నటిస్తోంది. దాసరి దర్శకత్వంలో శ్రీకాంత్ నహతా హిందీలో నిర్మించే "సీతారాములు" చిత్రంలోనూ, డి. రామానాయుడు హిందీలో నిర్మించే "దేవత" చిత్రం లోనూ నటించబోతోంది.



అరుణ, కవిత 'కల్యాణ వీణ'

## "వండంటే కాపురానికి పన్నెండు సూత్రాలు"

"మే 15 నుంచి 30 వరకు జరిగిన రెండవ షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయింది," అన్నారు అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ అధినేత దగ్గుబాటి భాస్కరరావు. ఈయన నిర్మిస్తున్న పై చిత్రంలో సుమన్, విజయశాంతి, గొల్లపూడి మారుతీరావు, పి. ఎల్. నారాయణ, రాళ్ళపల్లి, కృష్ణవేణి, అన్నపూర్ణ, అత్తిలక్ష్మి, వహీదా పాత్రధారులు. కాశీవిశ్వనాథ్ రచన, ఆత్రేయ – కొసరాజు గీతాలు, సత్యం సంగీతం, చెంగయ్య ఛాయ, రంగారావు శిల్పం, మార్తాండ్ కూర్పులో రాజాచంద్ర డైరెక్టరు.



'రామరాజ్యంలో భీమరాజు' కృష్ణ

## క్రీస్తు చిత్రం మీద శ్రీలంకలో ఆక్షేపణ

జీసస్ క్రీస్తు మీద తయారయ్యే చలన చిత్రాన్ని ఆపు చేయించాలని శ్రీలంక ప్రభుత్వాన్ని అక్కడి రోమన్ కాథలిక్ చర్చ్ మత గురువులు కోరారు. పైగా ఏసుక్రీస్తు పాత్రకు మాజీ ప్రధాని సిరిమావో బండారనాయకే అల్లుడు విజయ్ కుమారటుంగ ఏమాత్రం తగడని కూడా పేర్కొన్నారు.






**12** **(గత సంచిక తరువాయి)**

కొమ్మమీద కూర్చునివున్న ముసలివాడు'

'నేనెలా తప్పించుకున్నాను. తప్పించుకోవడానికి నాకు శక్తి యుక్తులు ఎక్కడ నుండి వచ్చాయి?' అనుకున్నాడు. అతడు కిందికి చూసి, ''ఓయ్— సుక్కలం... ఇంగపోయి సలుగుల్దగ్గిర పడుకో. ఊరికే సుంక్రేసు చెట్టు చుట్టూ తిరిగి వొంటికి అల్తపెట్టుకోబాక'' అనరచాడు.

సుక్కపంది మోర పైకెత్తుకుని చెట్టు చుట్టూ తిరుగుతూనే ఉంది.

'అది సలుగులను పొదలలో వదిలిపెట్టి ఇక్కడ ఉండడం నాకేమీ ఇష్టంలేదు. అది త్వరగా పొదలోకి వెళ్ళిపోవాలంటే నేనేం చెయ్యాలి. ఎలుగెత్తి దానిమీద తిట్ల వర్షం కురిపించనా? ఈటెను చూపించి కండ్లు చితకబొడుస్తానని బెదిరించినా?' అని అతడు తనను తాను ప్రశ్నించుకున్నాడు. 'అవన్నీ వొరిగేపనులు కావు. నేను రచ్చచేసేకొద్దీ దానికి నామీద అపనమ్మకం జాస్తవుతుంది. సలుగుల వొదిలేసి సుంక్రేసు చెట్టును ప్రదక్షిణంచేస్తూ రాత్రంతా ఉండిపోతుంది' అనుకున్నాడతడు. అతడు కొంతసేపు ఆలోచించి, నేను కదలకుండా మెదలకుండా రంపూరచ్చా చేయకుండా మధ్యాహ్నపుటెండలో నీటి అడుగున పడుకుని ఉంటే ఇసుకదొంది చేపలాగ ఈ కొమ్మమీద ముడుచుకుని పడుకుంటాను' అనుకున్నాడతడు. అతడు ఈటెను పక్క కొమ్మమీద ఉంచి కాళ్ళు చేతులను మడిచి కొమ్మమీద పడుకుని, 'కావాలంటే ఉచ్ఛ్వాస నిశ్వాసాలను బిగబట్టి ఉంచుకుంటాను.' అనుకున్నాడు.

అతని యుక్తి ఫలించింది. సుక్కపంది కొంతసేపు చెట్టు బోదె చుట్టూ తిరిగి చివరిసారిగా మోరను పైకెత్తి తెల్లని కోరలను చూపుతూ గర్జించి ముందరి కాళ్ళను నేలమీద నాలుగుసార్లు గుద్ది వెనకకు తిరిగి తీంట్ర పొదలోకి వెళ్ళిపోయింది.

చెట్టు కింద నుండి పంది తాలూకు అడుగుల సవ్వడి వినబడక పోవడంతో అతడు మెల్లగ తలెత్తి చూశాడు. సుక్కపంది తీంట్ర పొదలోకి ప్రవేశిస్తుండడం చూసి తృప్తిగా గాలి పీల్చుకున్నాడు.

అప్పుడతడు తను ఇందాక గ్రహించని ఒక విషయాన్ని గ్రహించాడు. చాలసేపటి నుండి అతని శరీరం యావత్తూ గడగడ వణకుతూ ఉంది. అతనితోబాటు అతడు కూర్చుని ఉన్న కొమ్మ గూడ కంపిస్తున్నది. ఆ కొమ్మలోని ఆకులు, పూలు గూడా కంపిస్తున్నాయి.

'నేను చాల భయపడి పోయాను. ఈ దడ సరిగ్గా ఎప్పుడు ప్రారంభమయిందో మరి.' అని అతడు ఆలోచించ సాగాడు. 'జ్ఞాపకం లేదు. బహుశా సుక్కపంది నా ఎదమీద నిలబడి నామెడ చుట్టూ ముట్టెను బిగించినప్పుడు ప్రారంభమయిందేమో.' అనుకున్నాడతడు.

ముసలివాని శరీరం ఇంకా వణకుతూనే ఉంది. శరీరాన్ని అదుపులో పెట్టటానికి అతనికి సాధ్యం కావడం లేదు. భయం అతని ఎముకల లోనికి ఇంకిపోయింది. తనపైన తనకే జాలి వేసింది. ఎవరైనా తన భుజం పైన చరచి ధైర్య వచనాలు పలికితే బాగుండుననుకున్నాడతడు. అతడు తలెత్తి చూశాడు. అతని పైన ఆకాశం సువిశాలంగా పరచుకుని ఉంది. చంద్రుడు విసుగు విరామం లేకుండా వెన్నెలను కుమ్మరిస్తున్నాడు. అసంఖ్యాకమైన నక్షత్రాలు మిలమిల మెరుస్తున్నాయి. వివిధ పరిమాణాలలో, రూపాలలో ఉన్న మేఘాలు ఏమీతోచనట్లు తిరుగుతున్నాయి. అతనికింద భూమి ఆకాశంవలె అనంతంగా వ్యాపించిఉన్నది. చెట్లు, కొండలు, నదులు, లోయలు ఒకదాని ఉనికి మరొకటి గుర్తించనట్లు ముడుచుకుని మౌనంగా ఉన్నాయి.

'ఇదంతా నిజంగానే జరిగిందా? సుక్కపంది నాకు నిజంగానే కనబడిందా? లేక నేను కలగన్నానా?' అని ప్రశ్నించుకున్నాడు ముసలివాడు. అతడు చెట్టుకింద కలయజూశాడు. తను పందితో పోరాడుతూ దొర్లుతున్నప్పుడు తనకిందపడి ఎండుటాకులు, పచ్చగడ్డి నలిగిఉండడం కనిపిస్తున్నది. తన మొలనుండి జారినకత్తి సుంక్రేసు చెట్టుకు అల్లంతదూరాన పడి ఉన్నది. పంది నడచినబాట చెట్టు చుట్టూ వలయాకారంగా కనిపిస్తున్నది.

అతనిశరీరం ఇంకా సన్నగా కంపిస్తున్నది. తొడలమీద కాళ్ళమీద కండరాలు చీలికలు చీలికలుగా వ్రేలాడుతున్నాయి. నెత్తురు బొట్లు బొట్లుగా కారుతూ నేలమీద ఎండిన సుంక్రేసు ఆకులమీద పడి టప్పు టప్పు మని చప్పుడుచేస్తున్నది. గాయాలకు అంటుకుని ఉన్న ఇసుకరేణువులను అతడు వణుకుతున్న చేతులతో తుడవసాగాడు. క్రమక్రమంగా గాయాలనుండి రక్తస్రావం తగ్గిపోతున్నది. 'ఇంకెంతసేపు గాయాలు? పక్కులు కట్టేశాయంటే రక్తస్రావం ఆగిపోతుంది' అనుకున్నాడతడు.

గాయాలలో రక్తస్రావం తగ్గుతున్నదిగాని ఆగడంలేదు. 'ఈ గాయాలు పక్కులుకట్టడానికి చాలాసేపు పడుతుంది ఇవి సామాన్యమైన గాయాలుకావు. తొడలు చీలికలు పీలికలైపోయాయి. గుడి కాళ్ళు నంజర నంజరగా అర్గా పోయాయి. ఇంతటి చిత్రహింస నేను ఎప్పుడూ, ఎవరిచేతా అనుభవించలేదు' అనుకున్నాడతడు.

'మరి ఇంతటి ప్రేమ నేను ఎప్పుడూ ఎవరిమీద చూపలేదు. పందిచేత కాట్లు తింటూ నేలమీద దొర్లానేగాని నడుంలోని కత్తినిగాని, చేతిలోని ఈటెనుగాని ప్రయోగించలేదు' అనుకున్నాడతడు మళ్ళీ.

ఇంతసేపు భయం వల్ల మొద్దుబారిపోయి ఉండిన నరాలు ఇప్పుడిప్పుడే మేల్కొంటున్నాయి

---

**జరిగిన కథ — 3** ముసలివాడు ఆజానుబాహుడు. అతని ఆస్తి పందులు. అతని మనుమడు మేతకై పందుల్ని తోలుకొని పోయి తిరిగి రానందుకు ఆందోళన చెందాడు. వెతుక్కుంటూ బయలుదేరిన అతనికి పిల్లవాడు, పందులు రావడం కనుపించింది. కాని వాటిలో ఈనడానికి సిద్ధంగా ఉన్న సుక్కపంది కనుపించలేదు. దాన్ని వెతుక్కుంటూ అడవి వైపు నడవసాగాడు. గత కాలంలో జరిగిన కొన్ని అనుభవాలను మననం చేసుకుంటూ సుక్కపందికై అడవంతా గాలించసాగాడు. కుందేలు మాంసంతో కడుపు నింపుకుని ఆ రాత్రంతా వెతకను నిశ్చయించుకున్నాడు ముసలివాడు. చివరకు తీంట్ర పొదలో సుక్కపంది ఈనినట్లు తెలుసుకున్నాడు. సుక్కపంది మనిషి అలికిడి పసిగట్టి ముసలివాడిపైకి విజృంభించింది. ఎలాగో దాని బారినుండి తప్పించుకొని చెట్టెక్కి కూర్చున్నాడు ముసలివాడు.

---

గాయాలు సలపరించడం ప్రారంభించాయి. 'ఇంత నెత్తురు కారినా నాకు రణవాయువు కమ్మలేదు. నా స్థానంలో ఇంకొకడెవరైనా ఉండి ఉంటే ఈపాటికి నీలిగి చచ్చి ఉండును. సుక్కపంది కనబడడంతో నాకు ఏనుగు నెక్కినంత సంతోషంగా ఉంది. ఈ పరిస్థితిలో ఎంత రక్తం పోగుట్టుకున్నాగాని నాకు రణవాయువు కమ్మదు. యముని భటులందరూ తరలి వచ్చినా నన్ను చంపలేరు' అనుకున్నాడతడు.

'మరి ఇంతవరకు నేను సలుగులను కళ్ళ జూడనేలేదు' అనుకుంటూ ముసలివాడు ఉవ్విళ్ళూరసాగాడు. అతడు మెల్లగ కొమ్మమీద జరిగి మెడ రిక్కించి చూశాడు. తీంట్ర తీగలు నాలుగువైపుల చిక్కగా దడిగట్టుకొని ఉన్నాయి. సుక్కపంది మోరను నేలమీద పడేసుకుని పడుకొని ఉంది. సలుగులు తల్లి రొమ్మును కరచుకుని పాలు తాగుతున్నాయి.

''ఓరి నీయమ్మల ! సందమామలు మాదిరి ఎలగతా ఉండారు గదరా !'' అనరచాడు ముసలివాడు. దేవుడిని ప్రత్యక్షం చేసుకున్న భక్తుని వలె, రత్నరాసులను పొందిన లోభివలె అతడు తత్తర పడసాగాడు. అతడు గబగబ సలుగులను లెక్కపెట్టడం ప్రారంభించాడు. లెక్కపెట్టడం మధ్యలో ఆపేసి వాటి అందాన్ని కళ్ళతో గ్రోలడం ప్రారంభించాడు. అతని కళ్ళు నిలకడగాలేవు. అతని చూపులు బంతులవలె ఉన్న సలుగులమీద, అర మోడ్పుగా ఉన్న పంది కళ్ళమీద, చేపరించుకుని ఉన్న దాని రొమ్ములమీద ముందు నుంచి వెనక్కు, వెనక నుంచి ముందుకు పరుగిడుతున్నాయి. హోరుమని మొరవ లెత్తుకుని, కట్టమ ముంచడానికి సిద్ధమవుతూ దబక లెత్తుతున్న చెరువువలె అతని మనసు పొంగుతున్నది. అతడు అసంకల్పితంగా అర్ధరహితంగా కొన్ని చప్పుళ్ళు చేశాడు.

''ఒకటి, రెండు —'' అంటూ అతడు సలుగులను లెక్కబెట్టి, ''—పది. పది మంది సుక్క నా కొడుకులు పుట్టినారు.'' అని పెద్దగా వికృతంగా నవ్వాడు. అతడు కూర్చుని ఉన్న కొమ్మ అదిరింది. నవ్వు ఆగాక, ''పది మంది సుక్క నా కొడుకులు పుట్టినారు. ఒరే సుక్క నా కొడుకుల్లారా! రొమ్ముల్దగ్గిరేందిరా తారుకులాడతా ఉండారు? ఏంచేస్తా ఉండార్రా అడ?'' అనరుస్తూ పాటలోకి జారుకున్నాడు.

''ఏంరో నీయమ్మ నాయాండ్లారా
ఏం జేస్తా ఉండారు రో
పోలిగాని కూతురంట
తోలి సంవర్త ఆడిందిరో

ఆనంద పారవశ్యానికి లోనైనప్పుడు బూతు పాటలు పాడడం ముసలివానికి అలవాటు. ఆ పాటలోని బూతు మాటలను ఒత్తి ఒత్తి పలుకుతూ అతడు పాడుతున్నాడు.

''————————
సారిగాని పెద్ద కొడుకు
గుడిసె ఎత్తినాడురో ——''

ఆ పాటలోని లయను గురించిగాని, రాగం గురించిగాని అతనికిఖాతరులేదు. అందులోని భావం గూడా అతనికి పట్టలేదు. తన ఆనందాన్ని ధ్వని తరంగాలుగా మార్చి బయటకు వెదజల్లుతున్నాడు. సలసల కాగుతున్న నీరు ఆవిరి రూపాన తన్నుకొచ్చినట్లు అతనిలోని ఆనందం ధ్వనిరూపాన బయట కొస్తున్నది.

అతని బూతు పాటను వినడానికి సిగ్గుపడుతున్నట్టుగా చంద్రుడు మబ్బుల వెనక దాక్కున్నాడు. గాలి అతనిపాటను మోసుకుంటూ అడవి వెంబడి పరుగిడుతున్నది. చెట్లన్నీ తలలూగిస్తూ అతని పాటను వింటున్నాయి. వాగులోని నీళ్ళు అతని ఆనందంలో పాలు పంచుకున్నట్లు త్రుళ్ళిపడుతున్నాయి.








## అతడు అడవిని జయించాడు

గొంతు రాచిపోయేదాక అతడు పాడుతూనే ఉన్నాడు.

బాగ పులిసి ఎండలో మరగ కాగిన కల్లు తాగి విపరీతమైన కైపుకు లోనైనప్పుడు అతడు చాల అద్భుతాలు చేసేవాడు. ఒకేసారి పదిమంది కూర్చోగలిగినంత బండను భూమినుండి పెకలించేవాడు. కాడెద్దులకు అలవిగాని మోతగల బండిని అతడు జరజర లాక్కుపోయేవాడు. సాంప్రదాయ స్త్రీలు దారిన పోతుంటే వాళ్లను వరసలు మార్చి పిలిచి తగువులు తెచ్చుకునేవాడు. పెద్ద పెద్ద గుట్టలను అవలీలగ ఈ వైపున ఎక్కి ఆ వైపున దిగేవాడు. దారి పక్కన చిన్న గులక రాళ్లను తగిలించుకుని బోర్లపడేవాడు. వొళ్లంతా గాయాలు చేసుకుని గుడిసెకు చేరేవాడు. ఎవరైనా కడవెడు చన్నీళ్లు నెత్తిన దిమ్మరిస్తే నేలమీద పడి మొద్దువలె నిద్రపోయేవాడు.

కాని అతడు ఈ పూట అనుభవిస్తున్న పరవశతను అతనికి ఏ పదార్థంగాని, ఎప్పుడుగాని కలిగించలేదు. 'కనుకనే నేను బతికాను లేకపోతే సుక్కపందిచేత ఇన్ని కాట్లు తిని, ఇంత నెత్తురు పోగొట్టుకుని రణాయువు కమ్మి చావకుండా బతికి ఉండేవాడినా?' అనుకున్నాడు ముసలివాడు

చంద్రుడింకా మబ్బుల వెనకనే ఉన్నాడు ముసలివాడు తలెత్తి సుంక్రేసు కొమ్మలగుండా చూస్తూ, 'నువ్వేమీ బయటకు రానక్కరలేదు. ఇక్కడ తీంట్రపాదలో పది చందమామలున్నాయి నువ్వు బయటకొస్తే ఎంత, రాకపోతె ఎంత' అనుకున్నాడు.

చంద్రుడు మబ్బులను చీల్చుకొని బయటకొచ్చాడు. 'రా . వచ్చి చూసుకో. తీంట్రపాదలో నిన్ను పోలినవాళ్ళు, నిన్ను మించినవాళ్ళు పదిమంది ఉన్నారు' అనుకున్నాడు ముసలివాడు

## 13

తోటి గువ్వ తీంట్ర పాదమీద వలయాలు తిరుగుతూ అరుస్తూ వున్నది. 'ఓరి నీయమ్మ నిన్ను మరచేపోయినాను గదరా. నువ్వు ఆనవాలు చూపించి పుణ్యం కట్టుకోకుండా ఉండి ఉంటే నేను సుక్కపందిని కండ్లజూసి ఉండేవాడినికాను రాత్రి తెల్లవార్లూ అడవిలో తిరుగుతూ గడిపి ఉండేవాడిని. నీమేలు జన్మలో మరచిపోను. నీకెప్పుడైనా అవసరమొస్తే చెప్పు ఇంతకు రెండింతలుగా నీకు సహాయం చేస్తాను' అనుకున్నాడు ముసలివాడు

తోటిగువ్వ "గిక్కూకు గిక్కూకు" మని అరుస్తూ తీంట్రపాదకు సుంక్రేసు చెట్టుకు మధ్యగాలిలో వలయాలు తిరగసాగింది. అది చివ్వుమని పైకి పోతూ, మళ్ళీ దిగుతూ, పల్టీలు కొడుతూ, వలయాలు తిరుగుతూ సందడి చేస్తున్నది. అది తన గొంతుకుగాని, రెక్కలకుగాని క్షణం పాటుగూడ విశ్రాంతి ఇవ్వడంలేదు

# అసలైన, సిసలైన

# గ్లూకోన్-డి ®

## ఒక్కటే. దానిని తయారు చేయువారు గ్లాక్సో.

మీకు పరిచయమైన
ఆకుపచ్చ ప్యాకెట్ పై తెలుపు
అక్షరాల్లో వున్న గ్లూకోన్-డి ®
కోసం చూడండి.




చౌకబారు నకిలీ సరుకుల్ని కొని మోసపోకండి. అది మీ కుటుంబ ఆరోగ్యానికే హానికరం, అందుకే గ్లాక్సో వారి అసలైన గ్లూకోన్—డినే కొనండి. గ్లాక్సో వారి గ్లూకోన్—డి, శుద్ధమైన గ్లూకోజ్ పౌడర్‌తో పాటు విటమిన్ డి—2, భాస్వరం మరియు కాల్షియంలతో బలపరచబడిన నమ్మకమైన ఉత్పాదన,

కోట్లాది ప్రజలు వాడతారు దీన్ని—అవసరమైనప్పుడల్లా శక్తి కోసం.

గ్లూకోన్—డి రకరకాల ఆహార పదార్థాలకు, ప్రాణ రక్షణకు వాడే ఔషధాలకు, మందులకు పేరెన్నికగన్న గ్లాక్సో కంపెనీచే తయారుచేయబడుతోంది.

మీరు కొనే గ్లూకోన్—డి ప్యాకెట్ అసలైనదే అని నిర్ధారణ చేసుకోండి.

## గ్లూకోన్-డి ® తిరిగి శక్తి నిచ్చేందుకు నమ్మకమైనది.

® ట్రేడ్ మార్క్

HTB-GLL-7027-TG

## అతడు అడవిని జయించాడు

'ఈ తోట గువ్వకు నేను ఏ విధంగా సహాయం చేయగలను ?' అని ముసలివాడు ఆలోచించసాగాడు. 'ఉరులు వేసి పట్టి దానిని ఇంటికి తీసుకెళ్ళగలను. పంజరంలో ఉంచి పెంచుకోగలను. మామిడి ముట్టెలో అనుదినం నీళ్ళు పెట్టగలను. పంజరపు ఊచలగుండా ధాన్యాన్ని, చెదపురుగులను చల్లి దానిని పోషించగలను.' అనుకుంటూ అతడు పథకాలు వేయసాగాడు.

'అలా చేయడంద్వారా తోటగువ్వకు వొనగూడే దేమిటి ? నేను అల్లి ఇచ్చే పంజరంకన్న పదిలమైన చెట్టుతొర్రలు ఈ అడవిలో చాల ఉన్నాయి. నేను మావిడిముట్టెలో అందించే నీటికన్న స్వచ్ఛమైన నీళ్ళు ఇక్కడ దొరుకుతాయి. ఇక దానికి కావలసినఆహారం పుష్కలంగా ఈ అడవిలో లభిస్తుంది. ఏ విధంగా ఆలోచించినా ఈ పిట్టకు నేను చేయగలసహాయం ఏదీలేదు.' అనుకున్నాడతడు.

'ఇది చాల దురదృష్టకరం. నాకు చేదోడు వాదోడుగా నిలిచిన పిట్టకు నేనేవిధంగానూ ప్రత్యుపకారం చేయలేకపోవడం చాల దురదృష్టకరం. నేను దానిని చంపక వదిలిపెట్టడమే దానికి చేయగలఉపకారం. పక్షికిగాని, జంతువుకుగాని మానవుడుచేయగల మహోపకారం వాటిమానాన వాటిని వదిలిపెట్టడమే. వాళ్ళ మధ్య నున్న సంబంధ బాంధవ్యాలు అటువంటివి' అనుకున్నాడతడు చేదు కాయను నమిలినవాడివలె.

'అలాగనుకోవటం పొరబాటు. ఇప్పుడు నేను సుక్కపందికి రక్షణనిస్తున్నాను కానా. దీని రక్షణకోసమేగదా నేనీ అడవిలో చెట్టుమీద పడి ఉన్నది' అనుకున్నాడతడు చేదు కాయను ఉమ్మి వేయడానికి ప్రయత్నిస్తున్నట్టు.

'నువ్వు అచ్చంగా అందుకోసం ఇక్కడకు రాలేదు. సుక్కపందిని నువ్వు కాపాడేదేమిటి? అది భీమసేనునివలె పరాక్రమించగలదు. అది ముట్టెతో కొట్టిందంటే పచ్చిబండలు నెరియలు చీలిపోగలవు. ఐనప్పటికీ దానికి నా అవసరం చాల ఉంది. అదిప్పుడు పురుడు తీర్చుకుంటూ ఉంది. అతి సుకుమారమైన సలుగులను పదింటిని కని చాల బలహీనతకు, అసహాయతకు లోనై ఉంది. ఈ అడవిలో నీచాతినీచమైన మృగాలు చాల ఉన్నాయి. ఈ మృగాలబారి నుండి దానిని, దాని సలుగులను నేను రక్షించాలి' అని ఆలోచిస్తూ అతడు తన రాకను సమర్థించుకున్నాడు.

సుక్కపంది ఇంకా అలాగే పడుకుని ఉంది. సలుగులు దాని రొమ్ములను పీకుతున్నాయి. 'నిశ్చింతగా పడుకో. నిన్నూ, నీ సలుగులను కంటిని రెప్పవలె, వ్రేలిని గోరువలె నేను కాపాడుతాను. మీరు నిర్భయంగా ఉండండి. ఈ ముసలివాడు కాపాడేదేమిటని అనుకోకు. నీకుండేకండలు కోరలు నాకు లేకపోవచ్చు. కాని నా తలలో ఉండే యుక్తులు నీ తలలో లేవు. నా శరీరంలో ఉండే లాఘవం నీ శరీరంలో లేదు. పైగా నా చెంత ఈటె ఉన్నది' అనుకున్నాడతడు.

తోటగువ్వ అరవటం మానేసి చివ్వున కిందకు వాలి పచ్చికమీద కూర్చున్నది. చల్లని వెన్నెలలో వరుసగా నడుస్తున్న చెదపురుగులను అది పొడుచుకు తినడం ప్రారంభించింది. చెదపురుగులు చెల్లాచెదరై గడ్డిరెళ్ళల క్రింద,

## పెన్సిళ్ళన్నీ ఆకారానికి సమానమే
## కాని ఈ రకం మట్టుకు దీర్ఘకాలం వ్రాస్తాయి.

# నటరాజ్ పెన్సిళ్ళు

గ్యారంటీ : చెక్కుతున్నప్పుడు విరగదు.
ఎందుకంటే, దీని "బాండెడ్ లెడ్", మిగిలిన వాటి కంటె ధాటీగా పని చేస్తుంది. మరి పెన్సిల్ ఎంత తక్కువ విరిగితే అంత ఎక్కువ కాలం మన్నుతుందన్న విషయం మీకు తెల్సుకదూ !




గ్యారంటీ: అతి మృదువుగా, అతినల్లగా వ్రాస్తుంది.
ఎందుకంటె, నటరాజ్ అసమానమైన లెడ్ ఫార్ములా కలిగివుంది. మైక్రొనైజ్‌డ్ గ్రాఫైట్ మరియు క్లేల మిశ్రమము.
ఇంకా, అతి ప్రత్యేకమైన శ్రేణిలో అప్సరా పెన్సిళ్ళు ! రాయుటకు, రంగులు వేయుటకు, డ్రాయింగుకు మరియు గ్లాస్ మార్కింగ్ ల కొరకు.

# నటరాజ్ దీర్ఘజీవంగల పెన్సిళ్ళు

హిందుస్థాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్ 79 పాల్టన్ రోడ్, బొంబాయి 400 001.

OBM/4080/TL












గులకరాళ్ళ క్రింద దాగుకొనసాగాయి. కొంత సేపటికి తోటి గువ్వకు కడుపు నిండింది. అది దాపున ఉన్న గుండుకేసి తన ముక్కును రాచు కుంటూ తుడుచుకున్నది. తరువాత భారంగా గాలిలోకి లేచి రెక్కలు కొట్టుకుంటూ వెళ్ళి పోయింది. అలా వెళ్ళిపోతున్న పిట్టను చూస్తూ ముసలివాడు, 'నీళ్ళు తాగి రావడానికి కాబోలు వెళ్ళుతున్నాడు' అనుకున్నాడు.

'రేపు ఇంటికి వెళ్ళిన తరవాత ఈ సుక్క పందిని, సలుగులను ఎక్కడుంచాలి ?' అని అతడు ఆలోచించసాగాడు. 'ఇప్పుడున్న దొడ్డిలో మిగతా పందులతోబాటు ఈ సుక్కపందిని దాని సలుగులను ఉంచడానికి వీలుపడదు. ప్రత్యేకంగా ఒక దొడ్డి కట్టాల్సిందే. కాని దొడ్డి కట్టడం కేవలం మాటలతోనే అయిపోయే పనికాదు. ఇటుక రాళ్ళు కావాలి. శ్రమన్ను కావాలి. తాటి పట్టెలను కొట్టుకొచ్చి బండల కింద అణగ బెట్టాలి. కలబంద పట్టలను కొట్టుకొచ్చి మురగవేసి నార తీయాలి. తీరా దొడ్డి తయా రయేసరికి కనీసం ఇరవై రోజులవుతుంది. అంత వరకు అవి ఎండలో, వానలో అలమటిం చాల్సిందేనా ?" అని అతడు దీర్ఘంగా ఆలోచించ సాగాడు.

కొంతసేపాలోచించగా అతనికి మార్గాం తరం తోచింది. 'ఎండలో వానలో అలమటిం చాల్సిన ఖర్మ వాటికేమొచ్చింది. వాటిని నేరుగా తీసుకుపోయి నా గుడిసెలోనే దింపుతాను. అవసర మైనంత కాలం అవి నా గుడిసెలోనే ఉంటాయి. అందాక నేను, పిల్లవాడు గుడిసె ముందున్న సిగరచెట్టుకింద పడుకుంటాం. ఎక్కడున్నా మాకు పొద్దుపోతుంది' అనుకున్నాడతడు.

చెదిరిపోయి ఉండిన చెదపురుగులు తిరిగి వచ్చి వరుసగా నడవసాగాయి. అవి ఇసుక రేణువు లను ఎక్కి దిగుతూ, పూరిక పుల్లల కింద దూరుతూ సాగుతున్నాయి.

దాహం తీర్చుకుని తోటిగువ్వ తిరిగొచ్చింది. కొత్తగా ఈనిన ఆవు తన లేగను చూసుకు నేందుకు వస్తున్నట్టులా అది అరుస్తూ వచ్చింది. నేరుగా వచ్చి తీంట్రట పొదమీద కూర్చుని అరవడం ప్రారంభించింది.

'తోటోడు సలుగులకు లాలి పాడుతున్నాడు' అనుకున్నాడు ముసలివాడు చంద్రుడు పాలవెన్నెల కురిపిస్తున్నాడు. గాలి చల్లగ వీస్తున్నది. 'అంతా సలుగుల కోసమే. నేను ఈటెను పక్కన పెట్టు కుని సుంక్రేసు చెట్టుమీద కూర్చుని ఉండడం గూడ సలుగుల కోసమే' అనుకున్నాడతడు.

'ఈ పూట నాకు చాల ఆనందంగా ఉంది. నోట్లో చెక్కెర పోసినట్టుగా ఉంది. కడుపులో పాలు పోసినట్టుగా ఉంది. ఉదయం లేచి ఎవరి ముఖం చూశానో మరి' అనుకున్నాడతడు.

ఒయాసిస్ సుందరి ...




నా తనువుకు తగ్గ సబ్బు ఒయాసిస్
నా మనసు మెచ్చిన సబ్బు ఒయాసిస్
నేను నమ్మిన సబ్బు ఒయాసిస్

తెలుపు, గులాబి మరియు
ఆకు పచ్చ రంగులలో లభిస్తుంది.

ఒయాసిస్
టాయిలెట్ సబ్బు

ఒస్వాల్ ఏగ్రో మిల్స్ లిమిటెడ్,
న్యూ ఢిల్లీ వారి నాణ్యమైన ఉత్పాదన.

ముఖాన్ని అతడు జ్ఞాపకానికి తెచ్చుకోవడానికి ప్రయత్నించాడు. పై పంటితో క్రింద పెదవిని కొరుక్కుంటూ, తల వెనక భాగాన వ్రేళ్ళతో గోక్కుంటూ అతడు ఆలోచించి సాగాడు. ఎంత ప్రయత్నించినా అతనికి జ్ఞాపకం రాలేదు.

'బహుశ పిల్లవాని ముఖం చూసి ఉంటాను. కాదు. కాదు. వాడు నాకంట బడింది పొద్దు నాలుగు బారలెక్కినాకనే.' అని అతడు అభిప్రాయ పడ్డాడు. పిల్లవాడు పొరుగూర్లో వీధి నాటకాన్ని చూడడానికై వెళ్ళి ఉండినాడు. నిద్రలేక పోవడం వల్ల ఎర్రనైన కళ్ళతో, వాడిపోయిన ముఖంతో వాడు పొద్దు నాలుగు బారలెక్కినాక కాళ్ళీడ్చు కుంటూ ఇల్లు చేరాడు.

'మరయితే ఇంకెవరి ముఖం చూశాను.' అని ముసలివాడు ఆలోచించసాగాడు. అతని గుడిసె గ్రామం వెలుపల విసిరివేయబడినట్టుగా ఉన్నది. ఉదయాన్నే నిద్ర లేచి గ్రామస్థు లెవరైనా ముసలివాని గుడిసెకు రావడం కల్ల.

ముసలివాడు ప్రముఖుడు కాదు. అతడు ఎవరికి తలలోనూ నాలుక కాదు. ఎందులోనూ కీలక పాత్ర కాదు.

ఆలోచిస్తూ ఉండిన ముసలివాడు చేతి వేళ్లతో నుదుటిమీద కొట్టుకుని, 'నా మతి మండినట్టే ఉంది. నేను ఉదయం లేచి చూసింది నుక్కపందినే. భుజాన ఉన్న గొర్రె కోసం గొల్లవాడు అడవంతా వెదికినట్టుంది నా వ్యవహారం' అనుకున్నాడు.

ఉదయం లేవగానే అతడు మొదటిసారిగా చూసేది తన పందులనే. రాత్రి పడుకోబోయే ముందు చివరిసారిగా చూసుకునేది గూడా పందులనే. ఉదయం నుండి సాయంత్రం దాక అతడు జీవించేది పందులతోనే. సందెవేళ నుండి తెల్లవారేదాక అతడు కలలు గనేది గూడా పందులను గురించే.

ముసలివాడు మళ్లీ అనుకున్నాడు :

పాలు పోసినట్టుంది.'' నెత్తిన కిరీటమున్నట్లు, భుజాలకు భుజకీర్తులున్నట్లు అతనికి అనిపిస్తూంది.

## 14

సగం రాత్రయింది. బిలిబిత్రి పూలు వికసించడం ప్రారంభించాయి. ఆ పూల తాలూకు వాసన గాలిలో తేలివస్తున్నది. పచ్చటి పాచిలో చుట్టుకుని ఉన్న నత్తల వలె ఉండిన బిలిబిత్రి పూలు కొద్దికొద్దిగా వికసిస్తూ తెల్లటి, ఎర్రటి రేకలను చూపిస్తున్నాయి. రంగు రంగుల రేకలు గల పూలతో నిండిన పచ్చిక బయలు శోభాయ మానంగా తయారవుతున్నది.

'ఇక నేను జాగ్రత్తగా ఉండాలి. అడవిలో క్రూరమృగాలు వేటకు బయలుదేరే సమయమ యింది. పైగా ఇది చిత్రి నెల.' అనుకున్నా డతడు.

నక్కలు, తోడేళ్ళు మొదలైనవాటికి వేసవి

ఈత కాలం. పిల్లల్ని కనడానికి సిద్ధంగా ఉన్న నక్కలు, పురుడు పోసుకుంటున్న నక్కలు తమ తమ గుహలను వదిలిపెట్టి రాకుండా ఉంటాయి. తమను తాము పోషించుకోవడమే గాక తమ భార్యలను గూడా పోషించి వలసి ఉన్నది గనుక మగ నక్కలు ఈ రుతువులో రెట్టింపుగా ఆహారాన్వేషణ సాగిస్తాయి. ఈ అన్వేషణలో అవి ఎంత సాహసానికైనా పూనుకుంటాయి. ఎంతటి నీచానికైనా వొడిగట్టుతాయి. 'సమయా సమయాలే గదా ప్రాణులను శాశించేది.' అనుకున్నాడు ముసలివాడు.

గాయాలమయమై ఉన్న అతని తొడలు, కాళ్ళు నొప్పి పెడుతున్నాయి. గాయాలమీద పక్కులు కట్టి రక్తస్రావం ఆగిపోయింది. పక్కులు కట్టడంతో బాధ ఎక్కువయింది. అతడు కొమ్మలమీద అటు ఇటు కదిలి నప్పుడు పుట్టే బాధను విభాయించుకొనడానికి పండ్లు కరచుకున్నాడు. అతడు వ్రేళ్ళతో తొడలను తడిమి చూసుకున్నాడు. గడ్డలు కట్టిన నెత్తురు అతని చేతి వేళ్ళకు అంటుకున్నది. దాని వాసన గుప్పున పీచింది. అతడు తన రక్తాన్నెప్పుడూ వాసన చూడలేదు. మరి ఏ మానవుడి రక్తాన్ని గాని వాసన చూడలేదు. కాని లెక్కలేనన్ని జంతువుల రక్తాన్ని వాసన చూశాడు. అతడు చేతులను కొమ్మలకు తుడుచుకుంటూ, 'మనిషి రక్తానికి జంతువుల రక్తానికి తేడా ఏమీ లేదు. కనీసం పంచేంద్రియాలు గ్రహించగల తేడా ఏమిలేదు' అనుకున్నాడు.

మూకుడు కింద పాత్ర పొంగుతున్నట్టు పక్కుల కింద గాయాలు సలపరిస్తున్నాయి. 'ఈ పక్కులు ఇంత త్వరగా కట్టకుండా ఉంటే బాగుండును. మరి ఆ పక్కులు కట్టకుండాఉండి ఉంటే రక్తస్రావం ఆగిఉండేదికాదు. ఈ పాటికి రణవాయువుకమ్మి చచ్చి ఉండేవాడిని. దేవుడు అన్నిటికీ అన్ని సదుపాయాలు అమర్చి ఉంచాడు. అతడు కొందరికి బాధరూపంలో వరాలిస్తాడు.' అనుకున్నాడతడు.

'మరి ఈ పూట నా నిద్రమాటేమిటి ?' అని అతడు ప్రశ్నించుకున్నాడు. 'ఈ పూటనేను నిద్రపోవడమన్నది అప్రస్తుతమైన విషయాలలో కల్లా అప్రస్తుతమైనది. నేను యుద్ధభూమిలో ఉన్నాను. శత్రువులను ఎదుర్కొనడానికి నేను అప్రమత్తతతో ఉండాలి' అనుకుంటూ అతడు చేయిచాచి పక్కకొమ్మమీదున్న ఈటెను అందుకోబోయాడు. అతడలా కదలగానే తొడలు కత్తితో కోసినట్టు బాధపెట్టాయి. అతడు పండ్లు కరచుకుని చేయి వెనక్కు తీసుకున్నాడు. 'వొంటి నిండా ఇన్ని గాయాలుండగా నాకు నిద్రమాత్రం ఎలా వస్తుంది ? కనీసం ఒక ముత్త కల్లు తాగితే గాని ఈ గాయాలు మరుపుకువచ్చి కంటిమీద రెప్పపడదు.' అనుకున్నాడతడు.

'అసలు నేను నిద్రపోవడానికై ఈ అడవికి రాలేదు. కుత్తుకదాక కల్లుతాగి, కాళ్ళు చాపి పడుకుని గుర్రుపెడుతూ నిద్రపోవాలని ఉంటే నేను గుడిసెలోనే ఉండేవాడిని. నేనిక్కడకు సుక్కపందికి కాపలా కాసేందుకు వచ్చాను. నేను దాని క్షేమాన్ని గురించి ఆలోచించాలి. దానికి నిద్రముంచుకొస్తుందేమో' అనుకుంటూ ముసలివాడు తీంట్ర పొదలోకి చూశాడు.

సుక్కపంది మోరను చాపుకుని, ముట్టెను నేలమీద పడవేసుకుని, కండ్లు మూసుకుని ఉంది. కొన్ని పలుగులు పాలు తాగుతున్నాయి. మిగిలినవి దాని కాళ్ళ మధ్య తారాడుతున్నాయి. ప్రపంచంలోని తృప్తి సర్వమూ దాని ఆకృతిలో కన్పట్టుతున్నది. 'దాని మనసులో సంతోషము ఆవడినెలలో గాలివలె సందడి చేస్తుండగా దానికి నిద్రమాత్రం ఎలా వస్తుంది. దాని ఆనందానికి, నా ఆనందానికి ఎవరూ భగ్నం కలగజేయకుందురు గాక'' అనుకున్నాడతడు.

నిద్ర మేలుకుని ఉండడం అతనికి కొత్తేమీ కాదు. భీమునికి సంబంధించిన ఘట్టాలుండే వీధి నాటకాలు జరుగుతుంటే అతడు రాత్రి పొడవు నా మేలుకుని ఉండి చూస్తాడు. ఆ నాటకాలు ఎంతదూర గ్రామాల్లో జరుగుతున్నా సరే అతడు వెళ్ళి చూసి వస్తాడు. వివిధ ఘట్టాలల్లో భీముడు పాడే పాటలను అతడు కంఠత నేర్చుకున్నాడు. అతడు తాదాత్మ్యం చెందే విషయాలు ఇంకా చాలా ఉన్నాయి. ఆకాశంలో గంభీరంగా నడయాడే నల్లని మేఘాలు, ఫెళఫెళార్భాటాలతో దూసుకువచ్చి గండశిలలను చీల్చే పిడుగులు, గూఢంగా, దృఢంగా నిలుచుని ఉండే పర్వతాలు — ఇవన్నీ పితృదేవతలవలె తనను దీవిస్తూ గమనిస్తూ ఉన్నట్లు అతడు భావిస్తాడు. అతడు లయించిపోయే ప్రాణి సుక్కపంది. పటిష్టమైన దాని దేహనిర్మాణాన్ని, శత్రువుపైకి ఉరికేటప్పుడు దాని దూకుడులోని ఉరవడినీ అతడు గురు భావంతోను, మరొకపుడు వాత్సల్యంతోను అతడు చూస్తుంటాడు.

చల్లని వెన్నెలలో బిలిబిత్రి పూలు తమ సువాసనలను, సొగసులను వెదజల్లుతున్నాయి. 'నడిరేయి మీరుతున్నది. శత్రువులు నిజంగానే వస్తారా ?' అని అతడు ప్రశ్నించుకున్నాడు. 'ఈ అడవిలో లెక్కలేనన్ని గుహలున్నాయి. పొదలున్నాయి. వాటిలో నక్కలు, తోడేళ్ళు, చిరుతపులులు ఉన్నాయి. అవి తమలో రక్తపిపాస పొంగుతుండగా, వాడియైన కోరలతో, పుష్టికరమైన పంజాలతో బయలుదేరుతాయి. బలహీనులను, అసహాయులను అవి వేటాడి చీల్చి చెండాడుతాయి. ఆ రక్త మాంసాలతో తమ భార్యలను, సంతానాన్ని పోషించుకుంటాయి' అనుకున్నాడతడు.

(ఇంకా వుంది)






# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

### టి. జి. కె. — బైపల్లి

ప్రేమించుకున్న యువతీ యువకులు పెళ్లి చేసుకోలేక పోతున్నారు కారణం ?

★ పెళ్లి బాధ్యతయేమోనన్న భయం.

### పి. ఆర్. ఎస్. — ఇల్లెందు

మనిషికి అనుభవం కంటే వేరే గుణపాఠం లేదంటారు. ఎంత వరకు నిజం అక్కయ్యా ?

★ చాలా వరకు నిజమే. కాని అనుభవజ్ఞుల మాటలు కూడా అప్పుడప్పుడు అనుభవంతో సమానమే.

### ఎవ్. ఎవ్. ఆర్. — విశాఖపట్నం

బ్రతికి సాధించలేనిది, చచ్చి సాధించ వచ్చు నంటారు. చచ్చి సాధించినది లేనిది మనకెలా తెలుస్తుంది ?

★ అదే — దాన్లో వున్న సేఫ్టీ !

### ఎస్. ఎమ్. — గుంటూరు

ఒక అమ్మాయి నన్ను ప్రేమించింది. నేనూ ఆ అమ్మాయిని ప్రేమించాను. ఇద్దరం జీవితాన్ని పంచుకున్నాము. పెండ్లి చేసుకుందామని అనుకున్నాము ...

★ పెళ్ళి చేసుకున్నాక జీవితాన్ని పంచుకుందామని అనుకుని వుండాలి మునీర్ భాయీ; బాధ్యతలు తారుమారు చేస్తే — విలువలు — మనిషి విలువలూ తారుమారైపోతాయి.

### వి. ఎవ్. ఆర్. — దొంకినవలస

నాకు రాయాలని వుంది. వ్రాసే ముందు ఏం రాయాలి? ముగించే ముందు ఏం రాయాలి?

★ నాకేం తెలియదు. నేను వెంకట్రామా వారి దగ్గర నుంచి రామకోటి పుస్తకాలు తెప్పించుకున్నాను. మనస్సు అలసటగా వున్నప్పుడో కోపంతో మండిపడి పోతూన్నప్పుడూ— నా ధ్యాస అనవసరంగా వాటిపై పోకుండా వుండాలనుకున్నప్పుడూ — ఇక దేన్ని గురించీ ఆలోచించకుండా — ఓ పది లైనులేనా రాస్తాను. పూర్తి చేసేయాలన్న ఆరాటం లేదు నాకు ...

### సి. హెచ్. ఆర్. — మారేడిపల్లి

నీతికి నిజాయితీకి తేడా ?

★ లేదు.

### కె. కె. — హైదరాబాదు

నా పేరు కౌసల్య. నేను ఒక కథ రాయాలని అనుకున్నాను. దీనికి మీ సలహా ఏమిటి ?

★ పేరులో కీర్తి లక్షణాలున్నాయి కె. కౌసల్యా. రాసేయడం మంచిది !

### జి. వి. ఎమ్. — హైదరాబాదు

డాక్టర్ల సలహాలిలా పత్రికాముఖాన చదివి— అనుసరించడం ప్రమాదం కాదా? మొన్నీమధ్య..

★ ప్రమాదమే కొన్ని—సాదాసీదా రోగాలకి చిన్నపెద్ద చిట్కాలు సూచించడంలో తప్పులేదు గాని రోగ లక్షణాలనుపట్టి వైద్యం సూచించడం తగనిపని. వాళ్ళు మందులుకొని వేసుకోవడం ప్రమాదం కూడా. ఏదైనా జరిగితే— మళ్ళీ ప్రశ్నవేసి బదులుకోసం ఆగుతారా!! అందుకే ఏదైనా సూచించినా కూడా— డాక్టర్ని సంప్రదించండి అని తప్పక సలహా యివ్వాలి. మూర్ఖులు, నిరక్షరాశ్యులు, హైజీన్ తెలియని వాళ్ళు ఎక్కువగా వుండే మనకి— యిలాంటి చిట్కాలు చిట్కా వైద్యాలు డేంజరే.

### ఎమ్. ఆర్. ఎవ్. — తణుకు

విత్తనం ముందని నేను, చెట్టు ముందని స్నేహితుడు...

★ ఇద్దరి కిద్దరూ రైటే—విత్తే-ముందు! చెట్టే ముందు !

### వి. కె. ఆర్. — రాజమండ్రి

ఈ సమాజంలోని వాళ్ళు కుంటివాడేంపని చేసినా కించపరుస్తు హేళన చేస్తారెందుకని ?

★ విలువలు తెలియక తమ్ముడూ; అలా హేళన చేసేవారి సంఖ్య చాలా స్వల్పంగా వున్నందుకు సంతోషించాలి. అంగవైకల్యంవున్నా మామూలు మనిషిలా బ్రతకడానికి తాపత్రయ పడేవారిని చూసి ఆనందించాలిగాని గేలి చేయడం మానవత్వం వున్నవాళ్ళు చేయరు.

### వెంకట్. — ఉరవకొండ

జీవితాన్ని నవలలో చెప్పినట్టు నడపడం సాధ్యమా ?

★ ఏ నవలలో చెప్పినట్టు ? అన్న ప్రశ్న వస్తుంది ! జీవితం నిజం— నవల— అవాస్తవం.

### జె. ఎస్. కె. — పొద్దుటూరు

ప్రతి సినిమాలోను, నవలలోను — చనిపోయినవారి ఆత్మ శాంతించాలంటే యీ పని తప్పకుండా చేయాలి అంటారు. ఎంతవరకు నిజం ?

★ నిజమో అబద్ధమో — చచ్చినవాడు 'అవుననీ కాదనీ' అనలేని స్థితిలో వుంటాడు కనుక — వాడి పేరు చెప్పి పని చేయిస్తారు !

### పి. ఎవ్. ఆర్. — అనంతపురం.

వేదికలెక్కి ఉపన్యాసాలు దంచే మహిళా నాయకురాళ్లు ఆ విషయం తమదాకా వస్తే — పుత్ర రత్నాలకు లక్షల కట్నం కావాలి అంటారు. కారణం ?

★ వారి మాటల్లో వారికే నమ్మకం లేదన్న మాట.

### ఆర్. ఎస్. ఆర్. — మంత్రిపాలెం

ప్రతి స్త్రీ జీవితంలో కోరుకునేది ఏమిటి?

★ తల్లిగా, భార్యగా, ప్రేయసిగా, అనుంగు నెచ్చెలిగా, గారాబు సోదరిగా, మంచి స్నేహితురాలిగా చూడబడడమే కాదు — మనిషిగా కూడా గౌరవింపబడాలని కోరుకుంటుంది. ★






# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్



(గత సంచిక తరువాయి)

## (డాక్టర్ సెవార్డు డైరీ)

మేం గదిలోకి దూకగానే, డ్రాకులా మా వైపు తిరిగి చూసాడు. అతని కళ్ళు క్రూరంగా, ఎర్రగా మండుతున్నాయి. ఎర్రటి పెదాలమధ్య, సూదుల్లాంటి తెల్లటి పళ్ళు మెరుస్తున్నాయి. చేతిలో వున్న ఆమెను ఒక్కవిసురుతో మంచం మీద పడేసాడు. వెంటనే మా వైపుకు దూసుకు వచ్చాడు. ఈలోపు ప్రొఫెసర్ నేలమీదనుంచి లేచి నిలబడ్డాడు. అతను డ్రాకులావేపు వెళ్ళాడు. అతని చేతిలో దేవుడి నైవేద్యం వున్న కవరు వుంది. అంతే, డ్రాకులా హఠాత్తుగా ఆగి పోయాడు. వెనక్కి నడవసాగాడు. అతను వెనక్కి వెనక్కి వెళుతుండగా మేం శిలువలను చేతిలో వుంచుకుని ముందుకు వెళ్ళాం. ఇంతలో చంద్రుడికి పెద్ద నల్లటి మేఘం అడ్డం రావటంతో, గదిలో చీకటి వచ్చేసింది.. ఆ సమయంలో క్విన్సీ తన దగ్గరున్న అగ్గిపుల్ల గీసి గ్యాస్ దీపం వెలిగించాడు. ఆ వెలుగులో వెలికితే ఏముంది ? డ్రాకులా మాయమయ్యాడు. అక్కడే వున్న తలుపు దబాల్న తెరుచుకుని మళ్ళీ మూసుకుంది. వాన్ హెల్సింగ్, ఆర్థర్, నేనూ మీనా దగ్గరకు పరుగెత్తాం. అప్పటికి ఆమె గాఢంగా వూపిరి తీసి, చెవులు చిల్లులుపడేలా కెవ్వుమంది. భయంతో వేసిన ఆ కేక జీవితాంతం మరిచిపోలేననిపించింది. కొన్నిక్షణాల వరకు ఆమె స్పృహలేకుండా పడిపోయింది. ఆమె మొహం భయంకరంగా పాలిపోయింది. ఆమె పెదాలు, చెంపలు రక్తపు మరకలతో నిండిపోయాయి. ఆమె గొంతు క్రింద చిన్న గాటు వుంది. ఆమె కళ్ళు బెదిరిపోయి చూస్తున్నాయి. రెండు చేతులతోనూ మొహాన్ని కప్పుకొని ఏడవసాగింది. ఆమె చేతులు బాగా కందిపోయి వున్నాయి డ్రాకులా రాక్షస బంధం వల్ల. ఆమె విచారం అంతులేనిదయింది. వాన్ హెల్సింగ్ ఆమె దగ్గరగా వెళ్ళి, ఆచ్ఛాదన సరిచేసాడు. ఆర్థర్ ఆమె మొహంలోకి ఒక్కక్షణం చూసి, వెంటనే బయటకు పరుగెత్తాడు.

"జోనాథన్ మగతలో పడివున్నాడు. అది డ్రాకులా సృష్టించింది. మినా గురించి మనం చెయ్యగలిగింది ఏమీ లేదు. కాసేపు ఆగితే ఆమె తేరుకుంటుంది. జోనాథన్ని నేను లేపుతాను" అన్నాడు వాన్ హెల్సింగ్. అక్కడవున్న తుండుగుడ్డను ఒకవైపు చల్లటి నీళ్ళలో ముంచి, జోనాథన్ మొహంమీద చిలకరించాడు. మినా రెండు చేతుల్తో మొహాన్ని కప్పుకుని ఏడుస్తూనే వుంది. కిటికీ తలుపు తెర తీసి, బయటికి చూసాను. వెన్నెల బాగా వుంది. ఆ వెలుగులో క్విన్సీమోరిస్ మైదానంలో పరుగెడుతూ, అక్కడేవున్న ఒక పెద్ద చెట్టుచాటున దాక్కున్నాడు. అతను ఎందుకలా చేసాడో అర్థంకాలేదు. అదే సమయంలో జోనాథన్ మేల్కొని ఆశ్చర్యంగా చూడసాగాడు. మంచంవైపు తల తిప్పాడు. విపరీతమైన భయం అతని మొహంలో కన పడింది. కొన్ని క్షణాల తర్వాత అతను పూర్తి స్పృహలోకి వచ్చాడు. మెల్లగా పైకిలేచాడు. మినా తలపైకెత్తి జోనాథన్వైపు చూసి రెండు చేతులూ చాచింది, అతని కౌగిలికోసం. కానీ వెంటనే చేతులు వెనక్కి తీసేసుకుని మొహాన్ని కప్పుకుని ఏడ్వసాగింద.

"అయ్యో దేవుడా, ఏమిటిదంతా ?" జోనాథన్ గట్టిగా అరిచాడు. "డాక్టర్ సెవార్డ్, డాక్టర్ వాన్ హెల్సింగ్, ఏదిటిదంతా ? ఏమయింది ? ఏ ప్రమాదం జరిగింది ? మీనా, ఏమయింది ? ఏవిటీ రక్తం ? అయ్యోదేవుడా, ఆ దయ్యం ఇక్కడికికూడా దాపురించిందా ?" అరిచాడు. మోకాళ్ళమీద కూర్చుని చేతుల్లో కొట్టుకున్నాడు "ఓ దేవుడా ! మమ్మల్ని రక్షించు ! ఆమెను కాపాడు. ఆమెను తప్పకుండా కాపాడు" అంటూ గభాల్న లేచి తన ఒంటిమీద బట్టలు తీసేయసాగాడు. "ఏం జరిగిందో చెప్పండి. అంతా చెప్పండి" అని ఒక్కసారి అరిచాడు. ఒక్కక్షణం ఆగి "డాక్టర్ వాన్ హెల్సింగ్, మీకు మినా అంటే ఇష్టం, నాకు తెలుసు. ఆమెను రక్షించడంకోసం ఏదో ఒకటి చెయ్యండి. పరిస్థితి చాలాదూరం పోలేదని చెప్పండి. ఆమెను కాపాడండి. నేను వాడి అంతు చూస్తాను" అన్నాడు. మినా అంత ఆందోళన లోనూ, భయంలోనూ, దిగులుతోనూ వుండి కూడా జోనాథన్ గురించి ఆలోచించింది. అతనికి ఏదో ప్రమాదం జరగబోతున్నట్టు భావించింది. తన దిగులంతా మరిచిపోయి, అతన్ని పట్టుకుని "వద్దు జోనాథన్ వద్దు ! నన్ను విడిచి ఎక్కడికీ వెళ్ళొద్దు. ఈ రోజు రాత్రి చచ్చేంత నరకం అనుభవించాను. ఎంత నరకమో ఆ దేవుడికీ తెలుసు. నిన్ను ఎంత బాధపెట్టాడో ఆ రాక్షసుడు. నాకు తెలుసు. అది చాలు. నువ్వు నాతోనే వుండాలి. ఈ మిత్రులతోనే వుండాలి. వీళ్ళు నిన్ను కాపాడతారు." అని అరిచింది. ఆమె అరుపులో భయం వుంది. జోనాథన్ ఆమె మాటలు విన్నాడు. ఆమె అతన్ని దగ్గరకు లాక్కుని మంచంమీద కూర్చోబెట్టి, బలంకొద్దీ కౌగలించుకుంది.

వాన్ హెల్సింగ్, నేనూ, వాళ్ళిద్దర్నీ ఓదార్చటానికి ప్రయత్నించాం. ప్రొఫెసర్ తనదగ్గరున్న బంగారపు శిలువను పట్టుకుని అతి ప్రశాంతంగా పలికాడు.

"ఏమాత్రం భయపడొద్దు ! మేం ఉన్నాం. ఇది మీ దగ్గరున్నంతసేపూ, ఏ దుష్టశక్తీ మీ

**జరిగిన కథ—30 :** వాన్ హెల్సింగ్, మోరిస్, జోనాథన్ డ్రాకులా ఇంటి తాళం తీసారు. ఆ ఇల్లు సకల రోగాలతో ఉన్నట్లు, రక్తపు వాసనలతో పరమ రోతగా ఉంది. అక్కడ యాభయికి ఇరవై తొమ్మిది పెట్టెలు మాత్రమే ఉన్నాయి. అక్కడ ఉన్న వేనకువేల ఎలుకలను కుక్కల సహాయంతో తోలేసారు. డ్రాకులా ఇంటిలో ఏం జరిగిందో మినా తెలుసుకోవాలను కుంటుంది. జోనాథన్ శావ్ బ్లోగ్జావ్ ద్వారా మాయమయిన తొమ్మిది పెట్టెల ఆచూకి తెలుసుకుంటాడు. డ్రాకులానే అక్కడక్కడ పెట్టెలు సర్ది పెట్టేస్తున్నాడని తెలుసుకుంటాడు. రెన్ఫీల్డ్కు ఆత్మలంటె భయమని డ్రాకులాను అతను కలిసేఉంటాడని, ఏదో కొత్త పథకం ఉందని అనుకుంటాడు డాక్టరు సెవార్డ్. డాక్టర్ సెవార్డ్, డాక్టర్ వాన్ హెల్సింగ్, ఆర్థర్, క్విన్సీమోరీస్లకు మిస్టర్ రెన్ఫీల్డు తన కల గురించి చెపుతాడు. డాక్టర్ సెవార్డ్, డాక్టర్ వాన హెల్సింగ్, ఆర్థర్, క్విన్సీమోరిస్ మినా గదిలో జోనాథన్ క్రిందపడి ఉండటం చూస్తారు. మినా చేత తన రక్తాన్ని త్రాగిస్తున్న డ్రాకులాను చూసి వీరందరు భయభ్రాంతులవుతారు.

దరికి చేరదు. ఈ రాత్రికి మీరు నిశ్చింతగా వుండొచ్చు. మనం ఆందోళన పడటం మానేసి ఆలోచన చేయాలి.''

మినా జోనాథన్ని కౌగలించుకుని మౌనంగా వుండిపోయింది. ఆమె తల అతని గుండెల మీద ఆనించింది. ఆమె పెదాలు వుంచిన చోట అతని చొక్కామీద ఎర్రటి రక్తం మరకలు ఏర్పడ్డాయి. ఆమె గొంతు క్రింద భాగం నుండి కూడా రక్తం స్రవించటం మొదలు పెట్టింది. ఆ రక్తాన్ని చూడగానే వెంటనే కౌగిలి నుంచి విడిపోయి, విపరీతమైన ఆవేదనతో గొణిగింది.

''అయ్యో! నేను అపవిత్రురాల్ని అయ్యాను. నిన్ను తాకే అర్హతగానీ, ముద్దాడే హక్కు గానీ నాకు లేవు. నేను ఎంతో అపచారం చేసాను. ఇదంతా నా మూలంగానే''

''మినా, చాల్లేవూర్కో! నువ్వు అట్లా మాట్లాడ్డం నాకు అవమానంగా వుంది. నువ్వు అలా అనకూడదు. నేను వినకూడదు.'' జోనాథన్ అంటూ ఆమెను గుండెకు అదుముకున్నాడు. ఆమె అట్లా ఏడుస్తూ వుండిపోయింది. జోనాథన్ మమ్మల్ని చూసాడు. అతను కూడా దుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నిస్తున్నాడు, నోరు బిగపట్టి. కాస్సేపటికి ఆమె ఏడుపు దిగమింగుకుంది. తర్వాత జోనాథన్ ఎంతో ప్రశాంతంగా మాట్లాడాడు. అతని నిగ్రహాన్ని చూస్తే ఆశ్చర్యమేసింది.

''డాక్టర్ సెవార్డు, జరిగిందంతా చెప్పండి. కొంత నాకు అర్థమయింది. అయినా జరిగింది మొత్తం చెప్పండి''అన్నాడు జోనాథన్. జరిగింది వివరంగా చెప్పాను. అతను చాలా శ్రద్ధగా విన్నాడు. డ్రాకులా క్రూరమైన చేతుల్లో మినా ఎట్లా నలిగిపోయిందో, అతని గుండె మీద గాటు దగ్గర్నుంచి స్రవిస్తున్న రక్తాన్ని మినాను తాగమని ఎట్లా బలవంత పెట్టాడో చెపుతున్నప్పుడు, జోనాథన్ కోపంతో వూగిపోయాడు. కళ్ళు నిప్పులయ్యాయి. అతను అంత కోపంలో వున్నా, మినా కురులు దువ్వుతూనే వుండగలుగుతున్నందుకు, నాకు ఆశ్చర్యం అనిపించింది. చెప్పటం పూర్తిచేసాను. ఇంతలో క్విన్సీ, ఆర్థర్ తలుపు తట్టారు. ఇద్దరూ లోపలికి వచ్చారు. ఏంచూసారు, ఏంచేసారు అని ఇద్దర్నీ అడిగాడు జోనాథన్. దానికి ఆర్థర్ ''డ్రాకులా ఆచూకీ



## జీవన్ మృతులు

తెలియలేదు. ఏ గదిలో కూడా కనపడలేదు. మన పరిశోధన గదిలో వుండి వెళ్లినట్టున్నాడు. అయినా ... '' అంటూ ఆగాడు మినా వంక చూసి.

అతను ఆగటం చూసి ''ఆర్థర్, తొందరగా చెప్పండి. ఇక్కడ ఇప్పుడు దాయవలసినదేమీలేదు. ఇప్పుడు అన్నీ తెలియటమే మంచిది. నిస్సంకోచంగా చెప్పండి'' అన్నాడు వాన్ హెల్సింగ్.

''డ్రాకులా మన పరిశోధన గదిలో వున్నాడు. వున్నది కొన్ని క్షణాలయినా, చిందరవందర చేసిపోయాడు. మనం తయారు చేసిన కాగితాలన్నీ తగలబెట్టేసాడు. బూడిదయ్యాయి చాలా.'' అన్నాడు.

అప్పుడు నేను వెంటనే అన్నాను ''భగవంతుని దయవల్ల ఇంకో కాపీ మన దగ్గర వుంది.''

ఆర్థర్ మొహం విప్పారింది. మళ్ళీ ఒక్క క్షణంలో దిగులుగా మారిపొయ్యాడు. ''నేను క్రిందికి పరుగెత్తాను. కానీ అతని జాడ తెలియలేదు. వెంటనే రెన్‌ఫీల్డు గదిలోకి వెళ్లాను అక్కడ కూడా ఏవీ ఆచూకీ తెలియలేదు. కానీ..'' మళ్ళీ ఆగాడు.

''చెప్పండి తొందరగా'' జోనాథన్ ఆత్రుతగా అన్నాడు'' అతను చనిపోయాడు, అంతేనా ?'' అన్నాడు. ఇది విని మినా తల పైకెత్తింది. అందరి మొహాల కేసి చూసింది.

ఆర్థర్ ఏదో కొంత దాస్తున్నాడనిపించింది. కానీ ఏదో కారణంచేత దాస్తున్నాడని సరిపెట్టుకుని వూరుకున్నాను. వాన్‌హెల్సింగ్ క్విన్సీమోరిస్ వేపు తిరిగి ''మీరు చెప్పాల్సింది ఏమైనా వుందా ?'' అడిగాడు.

''కాస్త వుంది. నేను అనుకునేది నిజమా గాదా చెప్పలేను. ఇక్కడ్నుంచి డ్రాకులా ఎక్కడికి వెళ్ళి వుంటాడా అని ఆలోచించాను. డ్రాకులాను నేను చూడలేదు, కానీ రెన్‌ఫీల్డు గది కిటికీలోనుంచి ఒక గబ్బిలం ఎగురుతూ వెళ్లటం చూసాను. అది పడమర దిక్కుకు ఎగురుకుంటూ వెళ్లింది. కార్‌ఫాక్స్ వేపు వెళతాడనుకున్నాను, కానీ అటువేపు వెళ్ళినట్టులేదు. మళ్ళీ రాత్రి కాదా తిరిగిరాడు, ఎందుకంటే, ఇప్పుడు తెల్లారుతోంది. అతను కనపడడు. రేపు చూడాలి మన పనులు'' అన్నాడు మోరిస్.

కొన్ని క్షణాలు మౌనంగా వున్నారు అందరూ. మా అందరి గుండెల చప్పుడు అందరికీ వినపడుతున్నట్టుంది. వాన్‌హెల్సింగ్ మినా తల నిమురుతూ —

''మేడమ్ మినా, మీకు అసలు ఏం జరిగిందో చెప్పండి. జరిగినదంతా మీరు చెప్పడం బాధతో కూడిన పని నాకు తెలుసు. అయినా అందరం తెలుసుకోవాలి. ఇప్పటివరకు అందరం ఎంతో చురుకుగా పని చేశాం. పెద్ద ప్రమాదాన్ని ఎదుర్కొన్నాం. బ్రతికి బయట పడ్డాం. మళ్ళీ ప్రమాదాన్ని ఎదుర్కొడానికి సిద్ధంగా వుండేటందుకు మనం అన్నీ తెలుసుకోవాలి.''

పాపం మినా వణికిపోతూవుంది. తన తలను జోనాథన్ గుండెమీద ఆనించి, గట్టిగా, మరింత గట్టిగా పట్టుకున్న విధానం చూస్తే, ఆమె ఎంత భయకంపితురాలయిందో అర్థమవుతోంది. కొన్ని క్షణాల తర్వాత ఆమె తల కొద్దిగా పైకెత్తి వాన్ హెల్సింగ్‌కు తన చేతిని అందించింది. వాన్‌హెల్సింగ్ ఆ చేతిని అందిపుచ్చుకుని ముద్దు పెట్టుకున్నాడు ఎంతో ఆప్యాయంగా. మరో చేతిని జోనాథన్ పట్టుకున్నాడు, ఆమెను తన కౌగిలిలో పొందుకుని. ఆమెలో కొంత ధైర్యం వచ్చింది. మెల్లగా చెప్పసాగింది—

''మీరిచ్చిన నిద్ర మాత్ర వేసుకుని పడుకున్నాను. కానీ చాలాసేపటి వరకు అది పని చేయలేదు. ఎక్కువ మెలుకవతో వున్నానేమోననిపించింది. అప్పుడు నా మెదడులో భయంకరమైన ఆలోచనలు మొదలయ్యాయి. ఆలోచనలన్నీ చావు, దయ్యాలు, రక్తం, నెప్పి, బాధ ఇలాంటివాటి గురించే.''

జోనాథన్ ఆమె మాటలకు కలవరపడ్డాడు. బాధగా గొణిగాడు. అది గమనించింది మినా.

''నువు దిగులుపడకు. నువ్వు చాలా ధైర్యంగా వుండాలి. నాకు ధైర్యం చెప్పాలి... సరే, తర్వాత ఏమయిందంటే, మాత్ర వేసుకున్నాగాబట్టి, నిద్రకోసం ప్రయత్నించటం మంచిదనుకున్నాను. నాకు నిద్ర వచ్చింది అనుకుంటాను. ఎందుకంటే తర్వాత ఏం జరిగిందీ జ్ఞాపకం లేదు. జోనాథన్ గదిలో రావటం గమనించలేదు గానీ, నా పక్కనే పడుకోవడం మాత్రం లీలగా గుర్తు. అప్పుడు గదిలో ఏదో పొగమంచు ఏర్పడింది. ఇట్లాంటి పొగమంచును ఇదివరకు గమనించాను. అప్పుడు ఎట్లా భయపడ్డానో, ఈసారి కూడా అలాగే భయపడ్డాను. జోనాథన్‌ని లేపటానికి ప్రయత్నించాను. గాఢ నిద్రలో వున్నాడు. నిద్రమాత్ర నేను వేసుకున్నానా లేక ఇతను వేసుకున్నాడా అన్న అనుమానం వేసింది. ఎంత ప్రయత్నించినా నిద్ర లేవలేదు. దాంతో నాకు భయమేసింది. వణికిపోతూ అటూ ఇటూ చూడసాగాను. అప్పుడు కనపడ్డ దృశ్యాన్ని చూసేసరికి నా ప్రాణాలు పోయినంతపని అయింది. నోరు పెగల్లేదు. నా మంచం ప్రక్కన పొగమంచులో నుండి ఒక ఆకారం ప్రత్యక్షమయింది. అది పొడుగ్గా, సన్నగా, నల్లటి దుస్తుల్లో వున్న వ్యక్తి రూపం. ఇంతకి ముందు ఆ ఆకారం గురించి వినివుండటం వల్ల ఆదెవరో తెలిసి పోయింది. మైనంతో చేసినలాంటి మొహం, పొడుగాటి ముక్కు, తెరుచుకుని వున్న ఎర్రటి నోరు, ఆ పెదాల మధ్య సూదుల్లాంటి పళ్ళు, పిటచిలో లాసీ ప్రక్కనున్న ఆకారం లాంటి ఎర్రటి కళ్ళు, ఇది ఆ రూపం. ఇంకొకటి కూడా తెలుసు. ఆ ఆకారానికి నుదుట

ఎర్రటి చార వుంది. అది జోనాథన్ కొట్టిన దెబ్బ అయివుంటుంది. ఒక్కక్షణం అట్లా చూస్తూ వుండిపోయాను చలనం లేకుండా. గట్టిగా అరవటానికి నోరు పనిచేయలేదు. ఆ వ్యక్తి ఎంతో నెమ్మదిగా, పాడిగా జోనాథన్ వేపు వేలు చూపిస్తూ అన్నాడు :—

"అరవకు. అరిచావంటే, అతన్ని ఎత్తి కిందపడేసి, అతని తలలోని మెదడ్ని నీ కళ్ల ముందే బయటకు లాగేస్తాను."

ఏం మాట్లాడదామన్నా నోరు పనిచెయ్యలేదు. ఏం చేద్దామన్నా చేతులాడలేదు. విషపు నవ్వు నవ్వుతూ ఒక చేతిని నా భుజంమీద నుంచి గట్టిగా నొక్కాడు. రెండో చేత్తో నా గొంతు కింద గుడ్డలేకుండా చేసాడు. "ఇప్పుడు కాస్త దాహం తీర్చుకుంటేనే గానీ కులాసాగా వుండదు నాకు. నువ్వు గొడవ చెయ్యకు. ఇది నీకు కొత్త కాదు. ఒకటి రెండుసార్లు జరిగింది. నీ నరాల్లోని రక్తంతో దాహం తీర్చుకున్నాను కూడా" అన్నాడు. ఒళ్ళు జలదరించింది. ఏవిటో తలుచుకుంటే వింతగా వుంది, అతనికి అడ్డు చెప్పలేకపోయాను. బహుశా అతను అట్లా చెయ్యి వేసాడంటే, లొంగిపోవాల్సిందే అనుకుంటా. తర్వాత.. అయ్యో దేవుడా, ఆ రాక్షసుడు నా గొంతు క్రింద తన పెదాలను ఆనించాడు."

జోనాథన్ ఆమె మాటల వింటూ మళ్ళీ బాధగా మూలిగాడు. మినా అతని చెయ్యి మరింత గట్టిగా పట్టుకుంది. జాలిగా అతని మొహంలోకి చూసింది. మళ్ళీ మొదలెట్టింది —

"నాకు ఓపిక తగ్గిపోసాగింది. సగం ప్రాణం పోయినట్టుగా వుంది. అట్లా ఎంతసేపు ఆ రాక్షసుడు నా గొంతు క్రింద తన పెదాలు వుంచాడో తెలీదు. బహుశా చాలా సేపు అట్లా వుంచి వుంటాడనుకుంటా" అంటూ ఆమె తల తిరుగుతున్నట్టుగా చేసింది. జోనాథన్ ఆమెను గట్టిగా అదిమి పట్టుకున్నాడు. ఆమె మళ్ళీ తేరుకుని చెప్పింది —

"తర్వాత ఎగతాళిచేస్తూ మాట్లాడ్డం మొదలెట్టాడు. అయితే నువ్వుకూడా వాళ్లతో పాటు తయారయ్యావన్నమాట నాకు పోటీగా. నన్ను వెతికి పట్టుకోడానికి వీళ్లకు సహాయం చేస్తున్నావన్నమాట. నా సత్తా నీకిప్పుడే కాస్త తెలిసింది. తొందర్లోనే పూర్తిగా తెలుసుకుంటారు, నా దారికి అడ్డంవస్తే ఏం జరుగుతుందో! వాళ్ల సత్తా వాళ్ల ఇళ్లల్లో చూపించుకోవాలి. నా మీద చూపిస్తారా వీళ్ళు? దేశదేశాలను నా అదుపులో పెట్టుకున్నాను. ఎన్నో యుద్ధాలు చేసాను, వీళ్లంతా పుట్టటానికి వందల సంవత్సరాలముందు. మీవాళ్లకు నువ్వంటే ఎంతో ప్రేమ కదూ? ఇప్పుడు నువ్వు నాదానివి. నా శరీరంలో శరీరానివి. నా రక్తంలో రక్తానివి.

వేలాది కుటుంబాలు అనాదిగా వాడ్డబడుతున్న
లవంగనూనె ప్రభావాలన్నింటినీ ప్రామిస్‌లో మళ్ళీచూసారు.

# లవంగనూనెతో కూడిన సాటిలేని టూత్‌పేస్ట్ ప్రామిస్

మీరూ ఎందుకు వాడి చూడకూడదు మరి!




## ప్రామిస్

దంతక్షయంనుండి రక్షణకు తోడ్పడుతుంది. నోటినితాజాగా రూపొందించి దుర్వాసనను అరికడుతుంది.




Monde Selection
Gold Medal Winner




బల్సారా ఉత్పాదన

ఆరోగ్యంచిందే పళ్ళు,
చిగుళ్ళు, తాజాశ్వాస–
అదే మరి ప్రామిస్ వాగ్దానం.

CHAITRA-BLS-453R TEL

ఇక నువ్వు నా మాట వింటావు అందుకు వాళ్ళు నీకు శత్రువులవుతారు. ఇప్పటివరకు నువ్వు చేసినదానికి శిక్ష అనుభవించాలి. నన్ను మట్టుపెట్టడానికి వాళ్ళకు సహాయం చేస్తున్నావు. మరి ఇప్పుడు? నేను చెప్పినట్టు వింటావు. నేను నిన్ను 'రా' అని పిల్చినపుడు, నేలా, నదులు దాటుకుంటూ వచ్చి నేను చెప్పిన పని చేస్తావు అన్నాడు. తర్వాత తన చొక్కా పైకి లాగాడు. తన పొడుగాటి గోళ్ళతో గుండెల మీద గుచ్చి నరాల్ని బయటకు లాగాడు. రక్తం స్రవించడం మొదలెట్టింది. తన చేత్తో నా మెడపట్టుకుని నా నోటిని ఆ రక్తపుధార దగ్గర నొక్కిపట్టి వుంచాడు ఆ రక్తం తాగటానికి. ఓ దేవుడా! నేనేం పాపం చేసాను? అట్లాంటి స్థితి రావటానికి నేనేం పాపం చేసాను? నా జీవితంలో ఎంతో హుందాగా, నిజాయితీగా గడిపాను. అట్లాంటిది నాకెందుకా శిక్ష? నా యందు దయచూపు. నేనొక దీన ప్రాణిని. ఆపదలో వున్నాను. నన్ను రక్షించు, నా వాళ్ళ కోసం నన్ను కాపాడు'' అంటూ తన పెదాలను చేత్తో గట్టిగా రుద్దుకోసాగింది, పవిత్రంగా వుంచుకోటానికి.

ఆమె అట్లా తన కథ చెప్తుండగా, తెల్లవారసాగింది. బాగా వెలుగు వచ్చేసింది. జోనాథన్ మౌనంగా వున్నాడు. అతని మొహంలో బాధమాత్రం కనపడుతూనే వుంది.

మాలో ఎవరో ఒకరు, ఆ జంట పిలుపుకు అందుబాటులో వుండాలని నిశ్చయించుకున్నాం, మళ్ళీ మరో కార్యక్రమంలో మునిగేవరకు. ఈ రోజుకి ఇక ఎటువంటి అవాంఛనీయ సంఘటనలు జరగవనే, నమ్మకం.

## జోనాథన్ డైరీ :

అక్టోబర్, 3. నేను ఏదోపని చేస్తూ వుండాలి. లేకపోతే పిచ్చెక్కుతుంది. అందుకే

# జీవన్ మృతులు

డైరీ రాస్తాను. ఇప్పుడు ఆరయింది. మరో అర్ధగంటలో మేం మా పరిశోధన గదిలో కలవాలి. అక్కడ ఏదో ఆహారం తీసుకుంటాం. ఏదో ఒకటి కాస్త ఆహారం తీసుకోందే పని చెయ్యలేం అంటారు డాక్టర్ వాన్‌హెల్సింగ్, డాక్టరు సెవార్డు. ఇవాల్టి పనికి చాలా బలం కావాలి. జరుగుతున్న ప్రతి విషయం రాస్తూ పోతాను, ఎందుకంటే ఆలోచనలు ఆపకూడదు. సూక్ష్మ విషయం కూడా వదిలిపెట్టకూడదు. ఒక్కోసారి అవే ఉపయోగపడవచ్చు. అసలు ఎక్కువగా తెలుసుకోవడం వల్లనే, నేనూ మినా ఎక్కువ బాధల్లో పడ్డాం. అయినా ఏదో నమ్మకంతో ఆశతో ముందుకు పోతున్నాం. పాపం ఇవాళ మినా, చెంపల మీద జారుతున్న కన్నీటి మోముతో అంది—'కష్టాల్లో వున్నప్పుడే' మనిషి తన 'నమ్మకం' మీద పరీక్షకు గురి అవుతాడు. కాబట్టి మనం దేన్ని అయితే నమ్ముతామో, ఆ నమ్మకాన్ని వదులుకోకూడదు. అప్పుడు దేవుడు చివరవరకూ కాపాడతాడు. చివరవరకు! ఓ దేవుడా! చివరవరకు అంటే?...

డాక్టర్ వాన్‌హెల్సింగ్, డాక్టర్ సెవార్డు ఇద్దరూ రెన్‌ఫీల్డును చూసి తిరిగి వచ్చారు. తర్వాత చెయ్యాల్సిన దాని గురించి చర్చించాం. మొదట డాక్టర్ సెవార్డు చెప్పాడు. అతనూ, డాక్టర్ వాన్‌హెల్సింగ్, క్రిందకువెళ్లి రెన్‌ఫీల్డును చూసారట. అతను నేలమీద కుప్పలాపడి వున్నాడట. మొహం మంతా చితికిపోయి, గాయలట. అతని మెడ ఎముకలు విరిగాయట.

అక్కడ వున్న పని వాడ్ని పిల్చి ఆ దారిలో ఎవరిదైనా అలికిడి విన్నావా అని అడిగాడు డాక్టర్ సెవార్డు. ఆ పనివాడు చెప్పాడు అతను సగం నిద్రలో వుండి క్రింద కూర్చున్నాడట.

మచిలీపట్నంలోని 'జయంట్స్' క్లబ్ వారి ఆధ్వర్యంలో బందరు మహిళా సేవా మండలి వారు ఇటీవల ప్రదర్శించిన 'నవ్వుల సందడి' నాటకంలో శ్రీమతులు టి. లత, రావినూతల సువర్ణాకన్నన్ (రచన, దర్శకత్వం), టి. జయలక్ష్మి, శారద పాల్గొన్న ఒక దృశ్యం



రెన్‌ఫీల్డు గదిలోంచి అరుపులు విన్నాడట. 'దేవుడా! దేవుడా! దేవుడా!' అని అరుస్తున్నాడట. తర్వాత దబ్బున క్రిందపడ్డ శబ్దం వచ్చిందట. గదిలోకి వెళ్లి చూస్తే, నేలమీద పడి వున్నాడట, ఇద్దరు డాక్టర్లు చెప్పినట్టుగా. ఎవరి గొంతుగానీ, గొంతులుగానీ విన్నావా అని అడిగారు డాక్టర్ వాన్‌హెల్సింగ్. దాని గురించి అతను ఏమీ చెప్పలేకపోయ్యాడు. ఇద్దరు మాట్లాడుకుంటున్నారేమో అనుకున్నాడట. తీరా వెళ్లిచూస్తే రెండోమనిషి కనపడలేదట. 'దేవుడా' అన్న మాట మాత్రం రెన్‌ఫీల్డు గొంతు నుంచి వచ్చిందే అన్నాడు. ఈ డ్రాకులా విషయాలు ఎవరూ నమ్మరు కనుక, రెన్‌ఫీల్డు మంచంమీద నుంచి క్రిందపడి చనిపోయినట్టుగా సర్టిఫికెట్ ఇవ్వటానికి నిశ్చయించుకున్నాడు డాక్టర్ సెవార్డు.

తర్వాత కార్యక్రమం ఏమిటి అని చర్చించాం మినాకు ఎటువంటి భయంకర విషయాలైనా, బాధతో కూడినవైనా, అన్నీ ఆమె కూడా తెలియపరచాలనుకున్నాం అందుకు ఆమె కూడా ఒప్పుకుంది. ఆమె అంత ధైర్యంగా ఒప్పుకోవటం చూస్తే జాలివేసింది. ఎక్కడో ఓ మూల ఆమెలో దిగులు, నిరాశ కనపడుతూనే వున్నాయి.

''మేడమ్ మినా, మీకు భయం వేయటం లేదా? అంటే మీ గురించి కాదు ఇతర ప్రాణాల గురించి!'' అడిగారు వాన్‌హెల్సింగ్. ఆమె ఒక్కక్షణం ఆగి ''లేదు నేను ఒక నిర్ణయానికొచ్చాను'' అంది.

''ఏ విషయంలో?'' వాన్‌హెల్సింగ్ మళ్ళీ నెమ్మదిగా ప్రశ్నించారు మేమంతా మౌనంగా వున్నాం. ఆమె ఎంతో స్థిరంగా జవాబు చెప్పింది ''నేను ప్రేమించేవారికైనా కీడు జరగబోతుందని తెలిస్తే, నేను చావదల్చుకున్నాను''

''అంటే, ఆత్మహత్య చేసుకుంటారా?'' అడిగాడు.

''అంతే! నాకు కావలసినవాళ్ళు ఒక్కరూ నాకు లేనప్పుడు ఏంచేస్తాను'' అంది కూర్చున్న వాన్‌హెల్సింగ్ లేచి నిలబడ్డారు ఆమె దగ్గరగా వెళ్ళి ఆమె తల నిమురుతూ ''చూడమ్మా! దేవుడి దయవల్ల నీకు ఎవరో ఒకరి అండ వుంటుంది'' అన్నారు. ఆయన కంఠం రుద్ధమయింది. ఒక్కక్షణం ఆగి మళ్ళా అన్నారు—

''ఇక్కడ మేం కొందరం వున్నాం. మీ చావుకు అడ్డం నిలబడతాం. మీరు చనిపోవటానికి వీల్లేదు. ఎవరి చేతుల్లోనూ చావకూడదు మన జీవితాంలో చెలగాటాలాడుతున్న ఆ రాక్షసుడు పూర్తిగా చనిపోయేవరకు మీరు బ్రతికే వుండాలి చనిపోతే, అతను మిమ్మల్ని వినియోగిస్తాడు. కాబట్టి మీరు బ్రతికే వుండాలి. బ్రతికి చావుకు ఎదురు తిరగాలి.






బులుసు వేంకటరమణయ్య

# ప్రాంతీయాభిమానం !?

భారతదేశంలోనూ యితరత్రా ఉన్నట్లే అనేక ప్రాంతాలున్నవి. అవి — ఆంధ్ర ప్రదేశ్, తమిళనాడు, కర్ణాటకం, కేరళం, మహారాష్ట్రం మున్నగునవి. ఆ యా ప్రాంతాలవారు ఆంధ్రులు, తమిళులు — మున్నగు పేర్లతో వ్యవహరింపబడుతున్నారు. అయినా అందరూ భారతీయులే ! విదేశాలలో వీరందరినీ భారతీయులుగానే గుర్తిస్తారుగాని ప్రత్యేకంగా ఆంధ్రులు, తమిళులు అని యీ మాదిరిగా గుర్తించరు.

ఆ యా ప్రాంతాలవారి భాషలు వేరు. ఆచార వ్యవహారాలు అలవాట్లు వేరు. మనిషిని చూడగానే అతడు ఏ ప్రాంతంవాడైనదీ ఊహించడానికి అవకాశం ఉన్నది. దేశ నాయకులు వేదికలెక్కి ఉపన్యాసా లిచ్చేటప్పుడు భారతీయులందరూ సమైక్యంగా ఉండాలనీ, ప్రాంతీయాభిమానాలు పెట్టుకొని లేనిపోని పట్టుదలలతో తగవులాడుకోకూడదనీ చెప్తూనే ఉంటారు. అయినా ప్రాంతీయాభిమానం పోదు. అది ఉండవలసినదే ! తమ ప్రత్యేకతను కాపాడుకోవలసినదే ! కాని యితర ప్రాంతాల వారిని నిరసనగా చూడకూడదు.

మన దేశం పరిస్థితి ఎలా ఉన్నదంటే — సరిహద్దు ప్రాంతాలకు పరస్పరం సహన, సహకారభావాలు కుదరడం దుర్ఘటంగా ఉన్నది. సరిహద్దులను గురించీ, నదీజలాల పంపకం గురించీ తగాదాలు కానవస్తూనే ఉన్నవి. వీటి పరిష్కారానికి మధ్యవర్తులను కోరడం జరుగుతూనే ఉన్నది. ఏదైనా ప్రణాళికవల్ల తమ ప్రాంతానికీ, పరిసర ప్రాంతానికీ మేలు చేకూరినా — తృప్తి వుండదు. కేవలం తమ ప్రాంతానికే ఉపయోగపడేలాగు ఉండాలనీ, ఇతర ప్రాంతాలకు ఉపయోగపడకూడదనీ కొందరు భావిస్తారు. ''సర్వేజనాః సుఖినోభవంతు'' అనే ఉదార సంకల్పం ఉన్నపుడే గౌరవ ప్రతిష్ఠలు నిలుస్తాయి. ప్రాంతీయాభిమానం ప్రగాఢంగా ఉన్నవారు ఇతర ప్రాంతాలవారిని ద్వేషింప నక్కర్లేదు. సంకుచిత దృష్టి కలవారే ఇతరుల్ని ఆక్షేపిస్తారు. కొన్ని యేళ్ళ క్రిందట రైలులో కలకత్తాకు వెళుతూ ఉన్నప్పుడు బరంపురంలో బండి యెక్కిన కొందరు ఉత్కళులు నా సమీపంలో కూర్చుని కొన్ని తెలుగు మాటలను అస్తవ్యస్తంగా అనుకరిస్తూ, తెలుగువారిని నిందిస్తూ, అధిక్షేపించడం ప్రారంభించారు. నేను మూగనోము పట్టి, వింటూ ఊరుకున్నాను. కొంతసేపటికి వాళ్లే తమ ధోరణిని మార్చుకున్నారు. ఇట్టి వానివల్ల కలిగే ప్రయోజనం ఏమిటో తెలియదు. ప్రాంతీయాభిమానులు తమ ప్రాంతపు అభివృద్ధికి పాటుపడడమే ముఖ్య కర్తవ్యం. ఇతర ప్రాంతీయులను ద్వేషించడం శ్రేయస్కరం కాదు. ★

నేను చెపుతున్నాను. మీరు చనిపోవటానికి వీల్లేదు. అటువంటి ఆలోచనే దగ్గరకు రానీయకూడదు'' ఆ మాటలు విని మినా వణికిపోయింది. మొహమంతా పాలిపోయింది. మేం మౌనంగా వున్నాం. ఆమె కూడా కొంతసేపు మౌనంగా వున్న తర్వాత ఎంతో విచారంగా, తన చేతిని ముందుకు చాచి ఆయనతో అంది —

''దేవుడి నిర్ణయం వుంటే, నేను అట్లాగే బతికి వుంటానని వాగ్దానం చేస్తున్నాను. ఈ భయంకరమైన కష్టాలు తీరేవరకు నేను బతుకుతాను'' అట్లా అనగానే అందరికి సంతోషమేసింది. ఇప్పటివరకు జరిగిన విషయాలన్నీ అందరం రాస్తూ వచ్చాం. ఆ కాగితాలన్నీ ఆమె జాగ్రత్తచేసి వుంచాలి, అని నిర్ణయించాం.

వాన్ హెల్సింగ్ ఆలోచనల్లో మాకన్నా బాగా ముందువున్నారు. చేయవలసిని పని అంతా ఆలోచించి వుంచి యిలా చెప్పారు—

''మనం ఆ పెట్టెల గురించి వెతకటం మానుకుందాం. వెతకటం మొదలెడితే, మన పనులు డ్రాకులాకు తెలిసిపోతాయి. పైగా ఈ పాటికి అతను జాగ్రత్తపడి వుంటాడు. మన పరిశోధనలో ఎంతో తెలుసుకున్నాం. ఈ రోజు తెల్లవారుజామున అతను ఏ రూపంలో వున్నాడో, మళ్ళీ రాత్రి వరకు అదే రూపంలో వుంటాడు. అతని శక్తులకు కూడా కొంత పరిధి వుంది. అతను వెంటనే ఏదో గాలిరూపం ధరించి తలుపు సందుల్లోంచో, నెరవుల్లోంచి దూరి వెళ్లలేడు. తలుపు మార్గాన వెళ్లాలంటే, మామూలు మనిషిగా, తలుపు తీసుకుని వెళ్లాల్సిందే. కాబట్టి అతను వుండే ప్రదేశాల్ని నిరుపయోగపరచాలి. అతన్ని పట్టుకోలేకపోవచ్చు గానీ, అతన్ని వెంటాడి, మనం ఒక వుచ్చు తయారుచేసి, అందులోకి అతను పోయేట్టుగా చెయ్యాలి. అప్పుడు అతని చావు ఖాయం. కానీ జోనాథన్, ఎంత తొందర పడతామో అంత ఆలస్యం జరుగుతుంది. అయినా అట్లాగే తొందరపడుతూ వెళితే, చివరకు మనం కోరుకున్న సమయం వస్తుంది.

ఇప్పుడు మనం ముఖ్యంగా పికడిల్లీలో వున్న ఇంటి సంగతి చూడాలి. ఇట్లాంటివి ఎన్ని కొన్నాడో ! వాటిల్లో అతను ఇళ్లుకొన్న తాలుకు పత్రాలు, తాళాలు వుంటాయి. అతను రాసే కాగితాలు వుంటాయి. చెక్కు బుక్కులు వుంటాయి. అతని తాలుకు వస్తువులు చాలా వుంటాయి, అన్నిచోట్లా. ఈ పికడిల్లీ ఇల్లు మంచి సెంటరులో వుంది. కాబట్టి అతనితాలుకు వస్తువులు అక్కడే వుంటాయి. ట్రాఫిక్ విపరీతంగా వుంటుంది. అతని రాకపోకలు ఎవరూ గమనించరు. మనం అక్కడికి వెళ్లి వెతుకుదాం. ఆ వస్తువులు అక్కడ వుంటే అతని ఆట కట్టేయవచ్చు. ఏమంటారు ?''

''అయితే వెంటనే బయల్దేరుదాం పదండి'' గట్టిగా అరిచాను.

**(ఇంకా వుంది)**

# ఘాటాక్షుని డైరీ



## దొంగ భక్తి !

మద్రాసులో వో కంపెనీకి చెందిన క్యాషియరు బ్యాంకు నుంచి 82 వేలరూపాయలు తీసుకుని వో టాక్సీలో హార్బరుకు బయలు దేరాడట. దారిలో టాక్సీ నిలచిపోయిందట. సెల్ఫ్ లేదు. కాస్త మీరు దిగి తొయ్యండి అని డ్రయివరు 35 ఏళ్ళ శంకరన్ ఆ క్యాషియర్నడిగితే ఆతను దిగేసరికి ఆ శంకరుడు రయ్యిన పోయాడట. పోలీసులీ కేసు విచారించి ఆ డ్రయివర్ని పట్టుకుంటే అతని వద్ద 58 వేలే వున్నాయట. ఖర్చయిన డబ్బులో అధిక భాగం దేవుని హుండీలలో వేశానన్నాడటా శంకరుడు.

## ఆస్తి కోసం రాక్షస వివాహం !

హిందుపూరుకు చెందిన మునిరెడ్డిపల్లెలో చెంచురెడ్డి అనే వో ధనికుని రెండో కుమార్తె 17 ఏళ్ళ శకుంతలకు ఆమె మేనబావకూ వివాహం స్థిరమయ్యిందట. అదే వూరులో ఆమె ఆస్తిమీద కన్ను వేసిన సంజీవరెడ్డి అనే వో యువకుడు తన అనుయాయులతో ఏప్రియల్ నాలుగో తేదీన శకుంతలను ఎత్తుకుపోయి, పుట్టపర్తికి చెందిన బుక్కరాయ సముద్రం అనే వూరిలో ఆమెను పెళ్ళాడి, ఆ తతగం అంతా ఫోటోలు తీయించి, ఇష్టంలేని పెళ్ళి అని కోర్టులో రేపు చెప్పావో, పైకెళ్లిపోతావంతే అని హెచ్చరించాడట. కేసు కోర్టుకు ఎక్కాక శకుంతల అన్ని విషయాలూ లిఖిత పూర్వకంగా కోర్టుకు నివేదించిందట — సినిమాలు మనుష్యుల్ని పాడు చేస్తున్నాయా, యీ మనష్యుల వల్లనే పాడు సినిమా లొస్తున్నాయా?

## దాగని నేరం !

ధర్మపురి తాలూకా మూక్కనూరులో 60 ఏళ్ళ కుప్పన్ అనే అతని కూతురు పళనియమ్మ వో రోజు వో పొదచాటున వో యువకునితో సల్లాపంగా మాట్లాడుతూండడం ఆమె అన్న చిన్నపొన్నన్ చూసి, ఆ పిల్ల యింటికి వచ్చాక చావబాద నారంభించాడట. అంతచేటు చావబాదకురా అని ఆతని తల్లి అడ్డొస్తే ఆమెనూ కోపంలో చావబాదాడట. దాంలో యీ రగడ చూస్తూ పొలంపోడానికి కొడవలి పదును పెడుతున్న కుప్పన్‌కు కోపంవచ్చి చేతిలో కొడవలికి పని కల్పించాడట. ఆ దెబ్బకు కొడుకు చచ్చి పోయేసరికిహ చేసేదిలేక పెరట్లో గొయ్యితవ్వి, శవాన్ని పాతేసి, కిక్కురుమనకుండా వూరుకున్నారట. పదిహేన్రోజులు గడిచాక యీ కుర్రాడేడి అని పోలీసులు ప్రశ్నిస్తే భయపడి అంతా కక్కేశాడటా కుప్పన్ — షేక్స్‌ఫియరేమన్నాడు ? హత్య దాగదోయ్ అన్నాడు...

## ఫలించని పథకం !

హైదరాబాదులో బాల నేరస్థుల జైలులో వున్న బాల ఖైదీలలో వో ఆరుగురు ఒకటిగా చేరి 25వ తేదీ అర్థరాత్రి తామున్న జైలుగది తాళం పగలేసి, బయటికి వచ్చి, ఆగ్జిలరీ హోం సూపర్‌వైజరును కర్రలతో దారుణంగా కొట్టి చంపి, గస్తీ తిరుగుతున్న గార్డును కూడా చితక బాదారట. ఇంతచేసినా పారిపోవాలని ఆ ఆరుగురు వేసుకున్న పథకం మాత్రం నెరవేరలేదట.

## బలి కోరిన ప్రేమ !

నామక్కల్ తాలూకా పొన్నేరిలో 35 ఏళ్ళ పెరియసామి వేలగవుండంపట్టి అనే వూరుకు పనికి వెళ్ళి అక్కడ 32 ఏళ్ళ కామరాజు అనే ఆతనితో స్నేహం చేసి, డబ్బు అప్పు తీసుకోడం, యివ్వడం వంటి వ్యవహారాలతో తరుచు ఆ వీధి లోకి వెళ్తూండేవాడట. ఆ వీధిలో వుంటున్న సెల్వి అనే అమ్మాయిని ప్రేమించి రహస్య ప్రేమాయణం పెట్టుకున్నాడట. అదే సెల్విని కామరాజు కూడా ప్రేమించడం వల్ల పెళ్ళయిన నీకు యీ ప్రేమాట లెవిటోయ్ చవటాయీ అని పెరియసామిని దుయ్యబట్టి, ఆత్రం చల్లారక, రాత్రి పార్కులో నిద్రపోతున్న పెరియసామిని చూసి, వో బండరాయితో అతని తల చితకేసి, చంపేసి పోలీసుల పాలయ్యాట్ట.

## ఆత్మహత్యకి దారితీసిన నిస్పృహ !

మధురకు చెందిన 30 ఏళ్ళ రాజేష్ అనే కుర్రాడు వుద్యోగార్థం కోయంబత్తూరు వెళ్ళి వో హోటలులో రూము తీసుకుని ప్రయత్నాలన్నీ విఫలమయ్యేసరికిహ జీవితేచ్ఛ చచ్చి, యీ విషయమొహ పుత్తరంలోరాసి, వురేసుకు చచ్చిపోయాడట, మొన్న ఏప్రియల్ 19వ తేదీన.

## కమీషనర్ జేబుకొట్టిన ఘనుడు !

మాడ్రిడ్ నగరంలో మెరియానో అనే వో పోలీసు కమీషనరుగారు నగరంలో తానుకూడా వో రవుండుచుట్టి, శాంతి భద్రతలన్నీ సరిగా వున్నాయని సంతృప్తిపడాలని యూమ్మని డ్రస్సు వేసుకుని రోడ్లమీద విలాసంగా సంధ్యావేళ తిరిగి, తిరిగి ఆహా నా డిపార్టుమెంటు శాంతిభద్రతలను ఎంచక్కా చూస్తోంది అని అబ్బురపడి అనక దేనికోసమో ప్యాంటు జేబు తడుముకుని, కెవ్వున కేకేసి, కొయ్యబారిపోయాడట. ఎవరో బాగా హస్తలాఘవంవున్న ధీరుడు ఆయన పర్సేగాక, పిస్టలుకూడా కాజేశాడటాయన ముఖాన్న మసి పూసినట్టు — చోరీ వొహ కళ. ''చోరకళ'' అని ఆర్యులననే అన్నారుకదా మాస్టారూ ! ★






# హైదరాబాదు నోట్‌బుక్

## విద్వత్కవి తల్లజుడు శేషశర్మ :

పులు గడిగిన ఆణిముత్యం మిత్రుడు, విద్వత్కవి కుంటిమద్ది శేషశర్మ. పాపవృత్తయే నరూపం—అనే కాళిదాసు వచనానికి లక్ష్యప్రాయమైన సుందర రూపం, రూపానికి సరూపమైన మనస్సు, మనస్సును అన్నిటా ప్రతిబింబింపజేసే సమున్నత చరితం, చరితంతో పోటీపడే పాండితి, పాండితికి మందనమైన కవిత — శేషశర్మ అంతరంగ బహిరంగ స్వరూపం. ఏడుపదులు వయస్సు దాటినా కదులుతున్న బస్సును ఉరకలు వేస్తున్న ఉత్సాహంతో చెంగున ఎగిరి పట్టుకున్నట్టే కవితా రథాన్ని పట్టుకొని ఇటు తెలుగులోను, అటు సంస్కృతంలోను నిరాఘాటంగా నడిపిస్తున్న నవయువకుడు శేషశర్మ. భావప్రౌఢంగా, ధారారమణీయంగా ఒయ్యారాలు ఒలికించే శేషశర్మకవిత ప్రకృష్ట ప్రతిభకు, ప్రగాఢ పాండితికి అద్దం పడుతుంది.

ఒప్పులైననేమి ? తప్పులైననునేమి
పొగడనిమ్ము పరులదెగడనిమ్ము
చెప్పినాడ—గాదు—చెప్పించినాడు నా
చేత — శేషియతడు, శేషుడేను.

అని సంపూర్ణశేషశేషి భావంతో ముందుకు సాగిపోతున్న మగ స్విశేషశర్మ. అనంతపురంలో 1913 ఫిబ్రవరి 22న జన్మించాడు శర్మ. తాతగారు సాహిత్య చక్రవర్తి శ్రీమాన్ శ్రీనివాసాచార్యులు. తాతగారు బళ్లారిలో వార్డ్లా హైస్కూలులో సంస్కృతోపాధ్యాయులుగా చేరినప్పుడు ఒక ఇంగ్లీషు ఇన్‌స్పెక్టర్ మీకు ఇంగ్లీషు రాదు. ఇంగ్లీషులో బోధించాలి—అన్నాడు. అప్పుడు ఆయన ఎబెయిర్, ఎడెక్స్ అని ఆరంభించి ఆరు నెలలలో అనర్గళంగా ఆంగ్లంలో ఉపన్యసించగల పాండిత్యం సంపాదించుకొన్నారట. ఆ పట్టుదల ఈ మనుమనిలోను ఉంది. చిన్ననాడు వార్డ్లా హైస్కూలులోను, మునిసిపల్ హైస్కూలులోను చదువుతున్నప్పుడే భండార్కర్ సంస్కృత వ్యాకరణం రెండు భాగాలూ కంఠస్థం చేశాడు శర్మ. పదేనవ ఏట ఇంగ్లీషు చదువు మాని పూర్తిగా సంస్కృతంలోకే దిగాడు. తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలో చేరి ఎనిమిదేళ్లు చదివి సాహిత్య శిరోమణి అయ్యాడు. పిదప విద్వాన్ అయి, మరికొన్నేళ్లకు పండిత ట్రెయినింగ్, ఎం. ఎ. అయ్యారు. కల్యాణదుర్గం, పెనుకొండ, ధర్మవరం అనంతపురంలలో తెలుగు పండితుడుగాను, సంస్కృత లెక్చరర్ గాను పనిచేసి, విరమించాడు. పెక్కు సన్మానాలు పొందాడు. వైష్ణవుల గురుపీఠాలలో ఒకటయిన పరకాల మఠంలో ఆస్థాన విద్వాంసుడుగా వున్నాడు. శేషశర్మ మంచివాగ్మి. ఆయన వక్తృత్వానికి అతని అందమూ వన్నెనిస్తుంది. లోకవృత్తానికి అమృత బిందువులైన 'సుధాబిందువులు'తో ఆరంభమైన శేషశర్మ రచన నాడు నాటికి ప్రౌఢమై సాగింది; తెలుగుతల్లి; రామిరెడ్డి, కేశవ సుప్రభాతం, యతిరాజీయం, గీతామృతం, రామాయణ పర్యాలోకనం, ముకుంద విలాసః, ఇందిరావందనం, శ్రీనివాస కుసుమాంజలి, విశిష్టాద్వైత సిద్ధాంతదర్పణం, హంస సందేశం, మనుసంభవః, ఆముక్తమాల్యద, శఠకోపవాగ్ఝురి, శాంతివిలాసం, రఘువేంద్ర విజయః, మేలినోము, అలంకార విచారం—మొదలయిన కావ్య, విమర్శగ్రంథాలను ఆంధ్ర గీర్వాణభాషలలో గద్య పద్యరూపాలలో వెలువరించింది. అముద్రితాలు అసంఖ్యాకాలు, మనుసంభవః, ఆముక్తమాల్యద అనేవి తెలుగు కావ్యాలకు సంస్కృతానువాదాలు. వాటిలో సంస్కృతాన్ని సీసం, ఆటవెలది, మధ్యాక్కరలవంటి తెలుగు ఛందస్సుల్లో నడిపించారు. ఇందిరా వందన సంస్కృతకావ్యంలో తెలుగు పద్ధతిలో ఆర్యను నడిపాదు యతిప్రాసలతో. ఉదాహరణకు :-

లీలా విభూతి రేషా
జాలం తస్యైవ సింధుజాజానేః,
నాలం తస్య పదద్విత
యాలంబన మంతరా త దత్యేతుమ్.

ముకుంద విలాసః శ్రీకృష్ణుని చరితం. బాల, ప్రౌఢ, దూత, ఆచార్య, సారథి, లీలాలోల, శరణ్య ఒ దశలలో శ్రీకృష్ణుని లీలలను ఇది వర్ణిస్తుంది.

లోకేయద్య త్సుందరం వైభవాఢ్యం
సర్వంతన్మే తేజసాంశేన జాతమ్,
జానీహిత్వం పార్థ ఇత్యాహయోవై
వందే మాయమర్త్య రూపం ముకుందం.

కుంటిమద్ది శేషశర్మ



ఇది ఆచార్యకృష్ణుడు పార్థునికి చేసిన ఉపదేశం. శేషశర్మ రామిరెడ్డి కావ్యంలో గ్రామాలలో జరిగే అన్యాయాలను తెగవేసి చెప్పాడు. గ్రామాలలో పెద్ద పెద్ద భూమి ఖామందులు చేసే రకరకాల బేద ఖాలీలను శర్మలాగ చెప్పిన వారు లేరు.

"పందిరివేసి, బండలను
బట్టియు, దిన్నెలుగట్టి తిన్నగా
ముందుకు సాగి, పొంతలను
బుంతలలోగొని పెద్దభూమి ఖా
మందులు మాటకారి మతి
మంతులు పైకొన నడ్డమాక వే
కందము చందమున్ దరిగి
యక్కట యూరి బజార్లు రూపరెన్.

శేషశర్మ కొత్త గ్రంథం విశిష్టాద్వైత సిద్ధాంత దర్పణం. ఇది ఏనాడో రచితమైనా ఇటీవలే ఈ సంవత్సరం ఏప్రిల్ 9న అనంతపురంలో ఆవిష్కృతమైంది. ఇది విశిష్టాద్వైత సిద్ధాంత సర్వస్వమనదగింది. బెంగళూరులోని శ్రీ లక్ష్మీ హయగ్రీవ సేవాట్రస్ట్ దీనిని ప్రచురించింది. శేషశర్మకు ఐదుగురు కుమార్లు, ఇద్దరు కుమార్తెలు. అందరూ అత్యున్నత విద్యావంతులు, విదేశాలలో కొందరు ఉన్నత పదవులు నిర్వహిస్తున్నారు. శర్మను ఇటీవల హైదరాబాదులో పరకాల మఠం స్వాములవారు సన్మానించినప్పుడు చూడగా, చిన్ననాటి ఉత్సాహంగాని, దేహపటిమ గాని వీసమంతయినా సడలలేదు. ఏమిటి నీ ఆరోగ్య రహస్యం ? — అనడిగాను. సాహిత్య సుద్య సిగ్ధుల స్నేహసుధ అన్నాడు. శర్మ సార్థకజీవి, నమ్మినదానిని కమ్మగా చెప్పగల సరసుడు; పాండిత్యాన్ని పదుగురికీ పంచుదామనే పంతం గల ప్రవచన పరాయణుడు. రచన, వక్తృత్వం ఆయనలో అహమహమికతో పరుగులు తీస్తుంటాయి. ఆ పరుగులే ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. శర్మ శతమానమూ జీవించి తన కర్తవ్యాన్ని నిర్వహిస్తూంటాడని నా విశ్వాసం.

## మేడే శ్రమశక్తి అవార్డులు ....

రాష్ట్ర కార్మికశాఖ మే దినోత్సవం సందర్భంగా రవీంద్రభారతిలో ఏర్పాటు చేసిన సమావేశంలో ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావు కార్మికులకు కార్మిక నాయకులకు, పరిశ్రమల యజమానులకు శ్రమశక్తి ఉత్పత్తి శక్తి అవార్డులు బహూకరించారు. ఉత్పత్తి శక్తి అవార్డు ఉత్పత్తిని, ఉత్పత్తి శక్తిని పెంచినందుకు పరిశ్రమల నిర్వాహకులకు, కార్మిక సంఘాలకు ఇవ్వబడింది. శ్రమశక్తి అవార్డులు కార్మికుల నేత కోసం ఇవ్వబడ్డాయి. ఉత్పత్తి శక్తి అవార్డులు తొలి సారిగా ఇచ్చారు. రాష్ట్ర ప్రొడక్టివిటీ కౌన్సిల్, జాతీయ ప్రొడక్టివిటీ

### గమనిక

వ్యక్తులపేర మీ రచనలు పంపితే వాటి పరిశీలనలో ఆలస్యం జరిగే ప్రమాదాలెక్కువ కనుక మీ రచనలన్నీ కూడా శీర్షిక పేరు కవరుపైన లేదా కార్డుపైన ఉదహరిస్తూ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపండి.

—సం.



## హైదరాబాద్ నోట్‌బుక్

కౌన్సిల్, అడ్మినిస్ట్రేటిక్ స్టాఫ్ కాలేజీల సహకారంతో 192 మేనేజ్‌మెంట్లకు, 150 కార్మిక సంఘాలకు పంపిన ప్రశ్నపత్రం ద్వారా ఉత్పత్తి శక్తి అవార్డుకు ఎంపిక జరిగింది. ప్రభుత్వ రంగంలోనూ, ప్రైవేటు రంగంలోను వున్న పెక్కు సంస్థలకు, కార్మిక సంఘాలకు ఈ అవార్డు లభించింది. శ్రమశక్తి అవార్డు పొందిన వారిలో శ్రీయుతులు సి. వి. చలపతిరావు (బి.ఎం.ఎస్.), వాసుదేవరావు (తెలుగుదేశం), నాయని నరసింహారెడ్డి (ఎల్. ఎం. ఎస్.), రఘురాములు (ఐ. ఎన్. టి. యు. సి.), మహమ్మద్ గౌస్ మున్నగువారున్నారు. ఈ సందర్భంలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ, కేంద్ర ప్రభుత్వం అనేక విషయాల్లో రాష్ట్రాన్ని నిర్లక్ష్యం చేస్తున్నదని విమర్శించారు. రాష్ట్రం పారిశ్రామికాభివృద్ధి సాధించాలంటే కార్మికులు, కర్మాగారాల యజమానులు కలిసికట్టుగా కృషి చేయాలని, పరిశ్రమాభివృద్ధికి తమ ప్రభుత్వం అన్ని విధాల ప్రోత్సహిస్తుందని, ప్రజలు తమ వద్దవున్న డబ్బును పరిశ్రమలకు పెట్టుబడి పెట్టాలని, పరిశ్రమల యజమానులు, కార్మికులు అన్నదమ్ముల వలె మెలగాలని, పరిశ్రమల యజమానులు తమ లాభాలలో నుంచి పెద్ద మొత్తాలను పన్నుగా కట్టక ఆ డబ్బును కార్మికుల సంక్షేమం కోసం వినియోగించాలని ముఖ్యమంత్రి సూచించారు. ఈ సమావేశానికి అధ్యక్షత వహించి రాష్ట్ర కార్మిక శాఖమంత్రి శ్రీ ఎం. రామచంద్రరావు ప్రసంగిస్తూ కార్మికులందరికీ స్వంత ఇళ్లు సమకూర్చే పథకం ప్రభుత్వ పరిశీలనలో వుందన్నారు. కార్మికుల సంక్షేమంకోసం ప్రభుత్వం పెక్కు పథకాలను చేపట్టబోతున్నదని ఆయన తెలిపారు. ఉత్పత్తిని పెంచేందుకు కార్మికులు, యజమానులు ముందుకురావాలని ఆయన కోరారు.

**ఉపశ్రుతి :**

"ఏంసార్, పోలీసు జాగిలాలు నాయకుల ఇండ్లల్లోకి దూరుతున్నాయట ఏకంగా ? ఏమిటీ విడ్డూరం ?" అనడిగాడు ఒక న్యాయశీలుడు నన్ను. "గొప్పోళ్ల గోత్రాలు గొల్లోళ్లకెరుక—అని గొల్లసుద్దుల్లో అన్నట్టు ఎవరి జాతకాలు ఎవరికెరుకో మనకేమెరుక" అన్నాడు మా సంభాషణ వింటున్న ఒక్క పల్లెపట్టు మనిషి.

— తిరుమల రామచంద్ర ★

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3
Editor : S Radhakrishna.